శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక.

కాకినాడ.

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

(Journal of the Telugu Academy.)

సంపుటము ౩౨. { స్వభాను. చైత్ర—ఆషాఢములు. } సంచిక ౧-౨.



కాకినాడ:

పరిషత్కార్యాలయమునఁ బ్రకటింపఁబడినది.

చందా, పోష్టువ్యయములతో సంవత్సరమునకు రు 3-0-0.

1943 ఏప్రియల్-జూలై.

# విషయసూచిక.

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రిక.

కాకినాడ.

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

(Journal of the Telugu Academy.)

సంపుటము ౩౨. { స్వభాను. చైత్ర—ఆషాఢములు. } సంచిక ౧-౨.

## స్వవిషయము.

స్వభానుసంవత్సరముతోఁ బరిషత్పత్త్రిక ముప్పదిరెండవ సంపుటము ప్రారంభింపఁబడుచున్నది. మహాసంగ్రామమువలనఁ గాగితము సకాలములో లభింపమి పత్త్రికాప్రకటన మాలస్యమైనందులకుఁ బాఠకులు క్షమింతురు గాక!

కవులు, భాషాభిమానులును ప్రాచ్యపాశ్చాత్యులచేఁ బ్రశంస గాంచినయాంధ్రభాషను, సాహిత్యమును వివిధమార్గముల నభివృద్ధి పఱుచుటకై ప్రయత్నింపవలసియున్నది. శుష్కవాదములవలనఁ బ్రయోజన మేమియు లేదు. విమర్శనముల వ్యక్తిదూషణమును బరిహరించి కేవలము విషయమునకే ప్రాముఖ్యత నొసంగవలయును. జాతీయతాభివృద్ధికరములు, సదుపదేశయుతములు నగునవలలు, కథలు రచింపఁబడవలయును. లలితకళలయందు నీతికి స్థానము కలదా? యనువిషయమునఁ బ్రాచ్యపాశ్చాత్యులు భిన్నమార్గముల నవలంబించియున్నారు. కావ్యములకు రమణీయతయు, సర్వజనాదరణమును, రంజకత్వమును గలుగవలయు ననినచో 'కాంతాసమ్మితత యోపదేశయుజే' యనుమమ్మట నిర్వచన మంగీకరింపక తప్పదు.

గ్రంథస్థమగు భాషయు, భావములును బరస్పరసమ్మేళనమును బొంది కావ్యసౌందర్యమును బోషింపవలయును. వాగర్థములకుఁ గల యవినాభావసంబంధమును గూర్చి మహాకవి కాళిదాసుఁడు తన రఘువంశమున 'వాగర్థావివ సంపృక్తౌ వాగర్థప్రతిపత్తయే' యను ప్రథమ శ్లోకముననే సూచించి వాని యన్యోన్యతను బార్వతీపరమేశ్వరులతోఁ బోల్చి వ్యక్తీకరించియున్నాఁడు. ఆంధ్రభారతి నేఁటియుగమునఁ జనుమార్గములు గంటకశిలావృతములై యున్నవి. భాషకు భావమునకుఁ బరస్పరసంబంధ మమరుటలేదు. ఒక్కొకచో భావ మంతరించుటయో, లేక బహుప్రయాసముచే స్థేయ మగుటయో సంభవించుచున్నది.

కవు లుపయోగించుపదములు మాఱుమూలపదములో లేక కృతకపదములో యగుచున్నవి. పరభాషావ్యామోహ మింకను మన యువకుల వీడకున్నది. అన్యదోషానుకరణము సుకరము. క్షీరనీరన్యాయమున నితరవాఙ్మయములఁ గలగుణముల గ్రహించుట సాహిత్యాభివృద్ధికి మార్గము. అంధపరంపరచే నందలిదోషములనే యనుకరించినచో వాఙ్మయమున కనర్థము వాటిల్లును. పైయాశయములఁ దమదృక్పథమున నుంచినచో నాంధ్రులు తమదేశభాషల కచిరకాలమున నభ్యుదయమును సమకూర్తు రనుట నిస్సందేహము.

---

## భాగవతుఁడు—పోతన.

విద్వాన్ పాలెపు వెంకటరత్నం.

శా. చేతన్ గంటము తాటియాకులపయిన్ జిందుల్ ఘటింపంగ, దృ
గ్వ్రాతంబందునఁ దీక్ష్ణయోజన శుభప్రారంభము స్ఫూర్ప, దీ
క్షాతంత్రుండు కవీశ్వరుం డొకఁడు సాక్షాద్భారతీనేతయే
యీతండా యనురీతిఁ బొల్చెడు సదాహీనప్రభావంబునన్. ౧

"కం. పలికెడిది భాగవత మఁట
పలికించెడువాఁడు రామభద్రుం డఁట నే
పలికిన భవహర మగు నఁట
పలికెద వేఱొండుగాథ పలుకఁగనేలా." ౨

చం. అని లిఖియించె భవ్యముగ నాకుపయుక్, బలికించుగాథ పా
వనతరమై సుధామధురభావయుతం బగునట్టిదా ? మహా
ఘనుఁ డగునట్టిపోతకవిగండఁడు దా రచియింపఁ బూనెనా ?
గొనముల ప్రోకమైన రఘుకుంజరుఁ డీకృతి నేలుభర్తయా ? 3

మ. కరిరాజున్ ధ్రువుఁడున్ గుచేలుఁడును గంగాపుత్రుఁడున్ గ్రీడియున్
హరివర్యుం డగునాంజనేయుఁడును బ్రహ్లాదుండు నేరీతి భ
క్తిరమాతత్త్వముఁ గొల్లగాఁ గొనిరొ రక్తిన్ ముక్తి నొప్పారిరో
సరిగా నీవును వారిఁ బోలెదవుగా సద్భక్తచూడామణీ ! ౪

మ. భళిరా పోతకవీంద్ర ! తావకకవిత్వప్రోజ్జ్వలత్ కల్పనా
వళి కీనాఁటికి సార్థకత్వ మది సంప్రాప్తించెరా ! భారతీ
లలనామంజులనూపురారవసుధాలాపంబులం బోని నీ
కలవాగ్జృంభణ కీ యపూర్వవిమలాకారంబు సిద్ధించెరా ! ౫

గీ. తాటియాకులపాకలోఁ దైలహీన
దీపిక సహాయ మొనరింప దివ్యరీతిఁ
గావ్యవిరచన మొనరింపఁ గల్గునీదు
శక్తియుక్తుల కిదియె యంజలి కవీంద్ర ! ౬

ఉ. భాగవతాగ్రగణ్యులస్వభావము నీకవితావిపంచికా
రాగములో మనోజ్ఞముగ రంజిల భక్తహృదంతరాళఘో
రాగము లెల్ల నీ రయి విరాగపువాఁకలఁ బర్వఁజేసె నో
యోగివరేణ్య ! పూతచరితోజ్జ్వలదివ్యకథానుషంగతన్. ౭

ఉ. నందకుమారుదివ్యచరణంబుల మ్రోఁగినమువ్వచాలు ని
ష్పందమనోహరం బగుశుభధ్వనిఁ బర్వఁగఁజేయుచుండ నీ
వంద మెలర్పఁ గబ్బముల నల్లితివా యలగోపకామినీ
సుందరుదివ్యగాథల విశుద్ధమతిన్ గవిలోకవర్ధనా ! ౮

ఉ. శాంతముగా వియత్స్థలిని చందురుఁ డీజగతీస్థలిన్ మహా
కాంతులఁ బర్వఁజేయ నొడికంబుగ నందసుతుండు గోపికా
కాంతల నాత్మవేణుమధుగానముచేఁ బిలిపించి యాముననా
ప్రాంతములందుఁ గూడుకత వ్రాసితివా ? రసకంధి పొంగఁగన్. ౯

కం. అటుచూడు మోకవీ ! వా
కిటిలో నొకదివ్యకాంత కెలఁకులఁ గాంతుల్
చటులగతిఁ బర్వఁగా సం
కటపడుచున్నటులఁ దోఁచు గనుగొను మిపుడే. ౧౦

గీ. కనుల బాష్పముక్తావళుల్ గాల్వఁగట్ట
నానతాస్యయై నిలుచున్నయావధూటి
పాదములఁ దాఁకి యవ్వానిభవ్యరజము,
తలను దాల్చితి వేల యుత్తమకవీంద్ర ! ౧౧

మ. కరకంజంబున నున్నరాచిలుక యుద్గ్రంథంబు నావల్లకీ
వరముం స్వచ్ఛతరాక్షమాలికయు నొప్పారంగ ని న్నెంతయో
కరుణాదృక్కుల నేలుభారతి భవద్గంభీరచిత్తంబు లోఁ
దరయం వచ్చినదా? ప్రణామ మిడు మయ్యా నాకుఁగా సత్కవీ ౧౨

గీ. భారతీదేవి మెట్టినపరమపుణ్య
గేహసీమను జగదీశుకీర్తనంబు
సలిపి తరియించివాఁడవు లలితభావ
భరితముగ భక్తితోడ సద్భాగవతుఁడ ! ౧౩

మ. స్వరసింధూన్నతనప్రవీణతను భూపశ్రేష్ఠుఁడౌ జానకీ
వరుఁ గీర్తించి ప్రసన్నుఁ జేసితివిలే నా భవ్యుండు త్యాగయ్య నీ
వు రమావల్లభుఁ గావ్యగానమున నింపుల్ పుట్టఁగాఁ దన్పి నీ
చరితన్ సజ్జనకీర్తనీయముగ నొంజం గ్రాలితౌ పోతనా ! ౧౪

---

# గ్రంథస్వీకారము.

ప్రాచీనవిజ్ఞప్తిపత్రములు—డాక్టరు హీరానందశాస్త్రిగారిచే రచితము (Ancient Vijnaptipatras - Dr. HirananandaSastri) బరోడా శ్రీ ప్రతాపసింహమహారాజరాజ్యాభిషేకగ్రంథమాలయందుఁ బ్రకటింపఁబడినది.

ఉత్తరహిందూస్థానమున క్రీస్తుపూర్వ మాఱవశతాబ్దమునుం

డియుఁ బార్శ్వనాథమహావీరులచే స్థాపింపఁబడినజైనమత మభివృద్ధిని
గాంచినది. జైనుల కహింస, సత్యము, అస్తేయము, అపరిగ్రహము
నను నాలుగు ధర్మములను బార్శ్వనాథుఁడు నిర్ణయించెను. జైనులు
శ్వేతాంబర దిగంబరులుగ రెండుశాఖ లయిరి. మహావీరుఁడు పై నాలుగు
ధర్మములతో బ్రహ్మచర్యమును నైదవధర్మముగ విధించెను. శ్వేతాంబర
జైనులు సాధువులు, సాధ్వులు, శ్రావకులు, శ్రావికులు నను నాలుగు
తెఱఁగులుగ నుండిరి. భాద్రపదబహుళద్వాదశి మొదలెనిమిది
రోజులు వీరు పర్యుషణ మనుపండుగను జరుపుచుండిరి. అందు నెని
మిదవదినము సాంవత్సరిక మనఁబడి, నూతనసంవత్సరప్రారంభము జరుగు
చుండెను. ఆదినమున జైనులు దమప్రాక్తనజీవితమును దలంచి, తా
మొనర్చినపాపములకుఁ బశ్చాత్తాపము నొంది నూతనసంవత్సరమున
ధర్మకార్యములఁ దమజీవితమును వినియోగించుటకై నిశ్చయింపుదురు.
శ్రీ పూజ్యు లనఁబడుజైనమతాచార్యులును ముఖ్యముగ శ్వేతాంబ
రులు, తమ విజ్ఞప్తి లేక క్షమాపణపత్రముల నితరయాచార్యులకుఁ
బంపుట యాచార మయ్యెను. అవియే విజ్ఞప్తిపత్రము లనుపేరఁ బ్రతి
మతమునందును గలవు. ఈపత్రములు సంస్కృతమునఁ గాని యచ్చటి
దేశభాషలోఁ గాని వ్రాయఁబడుచుండెను. వానిలో దేవనాగరి గాని
మార్వాడీ గుజరాతీ లిపులు గాని యుపయోగింపఁబడుచుండెను. ఇట్టి
యాచారము ఘూర్జరదేశమునఁ బ్రబలియుండె నని సంపాదకు లూహిం
చుచున్నారు. ఆపత్రములను బంపిన యాచార్యులను, చాతుర్మాస్యదీక్షను
దను సంఘారామమున జరుపవలసిన దని కోరుచు, తమధర్మరక్షను
వారికి విశదపఱుచుటయే విజ్ఞప్తిపత్రములఁ గలవిషయము. కొన్ని విజ్ఞప్తి
పత్రములు కేవలము ఉత్తరములవంటివి కావు. ఖండకావ్యములు గూడ
నై యుండెను. ఇందుదూతమను కావ్యమును వినయవిజయుఁడను జైనా
చార్యుఁడు సూరతునగరమునందలి విజయప్రభసూరికిఁ బంపెను. వినయ
విజయుఁడు యోధపురమున నుండుటచే (Jodhpur) నచ్చటనుండి
సూరతునగరమునకు మేఘదూతమునందువలెనే మార్గము నిర్దేశింపఁ

బడినది. మార్గమధ్యమునఁగల ముఖ్యస్థలములు నాయాపర్వతము లందలి చలువరాతిదేవాలయములు, మాండ్వీ మండపము మొదలగు నవి వర్ణింపఁబడినవి. మేఘదూతసమస్యాలేఖ, చేతోదూతము నిట్టిగ్రంథములే. ఇందుదూతరచయిత యగు వినయవిజయుఁ డింకను గొన్ని విజ్ఞప్తిపత్త్రముల రచించె ననియు, అందొకదానిలో శ్లోకార్ధము ప్రాకృత భాషయందు నుత్తరార్ధ మాయర్ధమును బూరించునది సంస్కృతమునను రచింపఁబడెనఁట.

పత్త్రము లెట్లు రచింపవలెనో, వీనిప్రమాణము, పత్త్రభంగప్రకారము (మడతపెట్టుట) లేఖనప్రకారము, పత్త్రనయనక్రమము, పత్త్రచిహ్నములు, మొదలగు విషయము లన్నియు వరరుచి కృతమగు పత్త్రకౌముదియందుఁ దెలియనగును. ఈవిజ్ఞప్తి పత్త్రములవలన దేశచరిత్రము, స్థలనిర్దేశము, సాంఘికజీవనము మొదలగువిషయము లెన్నియేని మనకుఁ దెలియుచున్నవి.

ఈగ్రంథమున సమకూర్పఁబడిన విజ్ఞప్తిపత్త్రములలో జహాంగీరు చక్రవర్తి ఫర్మానాతోడను, వివిధచిత్రములతోఁ గూడినవిజ్ఞప్తి యొకటి కలదు. అందలి చిత్రములు వివిధవర్ణయుతములై అక్బరు, జహాంగీరు కాలమునాఁటిసుప్రసిద్ధచిత్రకారుఁడగుశాలివాహనునిచేఁ జిత్రింపబడినవి. ఈపత్త్రమున జంతుహింస నిషేధింపఁబడినది. గ్రంథాంతమున నీపత్త్రములఁగల వివిధచిత్రములు గనఁబఱుపఁబడినవి. మొగలుసామ్రాజ్యము నాఁటి చిత్రకళాభివృద్ధిని గూర్చి తెలిసికొనుట కీగ్రంథము మిక్కిలి యుపయోగకారియగుచున్నది. వివిధచిత్రములతోఁ గూడినపత్త్రములపైఁ దమవిజ్ఞప్తులను వ్రాయుట యాశతాబ్దములలో నాచారమై యుండినటుల స్పష్టము. అట్టిపత్త్రములపై వ్రాయఁబడినకావ్యాదిగ్రంథముల వ్రాఁతప్రతులు నుత్తరహిందూస్థానమునఁ జెక్కుచోటుల లభించుచున్నవి. ఇట్టి యమూల్యగ్రంథమును బ్రకటించి శ్రీ బరోడాసంస్థానము వారు ప్రాచీనచిత్రకళా పత్త్రరచనాపద్ధతులఁ బరిశోధించుటకు వీ లొసంగి మహోపకారమును గావించిరి. గ్రంథమూల్యము. రు 9-11-0.

## Report on South Indian Epigraphy.
## మదరాసు శాసనపరిశోధక సంఘనివేదిక (1937-38.)

ఈ సంవత్సరము దొరకినశాసనములలోఁ బ్రాచీనమైనది నెల్లూరి జిల్లా కందుకూరు తాలూకా మాలకొండ పర్వతముమీఁది ప్రాకృత శాసనము. లిపి యశోకునికాలమునాఁటి బ్రాహ్మీలిపి. క్రీ శ. మూఁడవ శతాబ్దమునాఁటిదై యుండును. జైనబౌద్ధసన్యాసులకుఁ గొండగుహను, అరువాహిలకులసంభవుఁ డగు నందశెట్టి కుమారుఁడగు శ్రీవీరిశెట్టి యిచ్చినధర్మము. కాంచీపుర ప్రాంతమునుండి నెల్లూరువఱకుఁ గలదేశమునకుఁ బ్రాచీనకాలమున అరువా-వడతలై యని పేరుండెననియు, చరిత్రకారుఁడగు టోలమీ వ్రాసిన అరువర్ నాయ్ అనఁబడు ప్రజలు క్రీ. శ. రెండవశతాబ్దమున నాప్రాంతమున నుండిరనియుఁ దెలియుచున్నది. అందువలననే దాక్షిణాత్యులను దెలుఁగువారు 'అరవ'లని పిలిచియుందురేమో. క్రీ. శ. 2 వ శతాబ్దమునాఁటి యమరావతీశాసనము బ్రాహ్మీలిపి కలది గుంటూరుప్రాంతమున దొరకినది. ఇది ధనకటక మహావిహారము తూర్పు ద్వారమున కెదురుగ ధర్మచక్ర ధ్వజస్థాపనమును దెలుపుచున్నది.

ఆంధ్రభాష కత్యంతోపయోగ మగుపుణ్యకుమారుని తెలుఁగు శాసన మొకటి కడపజిల్లాలో దొరకినది. ఇది క్రీ. శ. ఏడవశతాబ్దము నాఁటిదై యుండును. ఎరికల ముత్తురాజు పుణ్యకుమారుఁడను ప్రభువు రేనాటి సీమను బాలించుచుండెను. అతనిమాలెపీరుశాసనము ఎపిగ్రాఫికా ఇండికా Vol XI. పుట 341 లోఁ బ్రకటింపఁబడినది. ప్రాచీనాంధ్రభాషాస్వరూపమును గుర్తెఱుంగఁగోరువారలఁ కీశాసనములు చాలముఖ్యములు.

కృష్ణరాయల శా. శ. 1450 నాఁటి తిప్పలూరు శిలాశాసనమున (No 282) నీగ్రామము అష్టదిగ్గజకవీశ్వరులకు దానమీయఁబడినట్లుఁ గలదు. అట్లయినచో నష్టదిగ్గజము లనఁబడునాంధ్రకవీశ్వరులు కృష్ణరాయలకాలమునాఁటివా రగునా కాదాయనువాదమునిర్ణీతమగును. కృష్ణరాయలకుఁ దమగ్రంథముల నంకిత మీయకపోయినను, రామలింగకవి, పింగళిసూరనఁ, రామరాజభూషణుఁడును కృష్ణరాయనియాస్థాన

మున నుండియు ంమరనుటయు పెద్దనాదులు వృద్ధులై యుండి రనుటయు సమంజసము. శాసనకాలము శా. శ. 1430 యనునది పొరపాటనియు శా. శ. 1450 అయియుండు ననియు ఈవేదికయందుఁ దెలుపఁబడినది.

మహాభారత నవనీతము.

కీర్తిశేషులగు ఆకొండి వ్యాసమూర్తి శాస్త్రిగారు మహాభారతోదధి దధిభాండమును నిజమేధామంథానముచేఁ జక్కఁగ మథించి యుద్ధరించిన "మహాభారతనవనీత"మను గ్రంథమును వారినందనులు శ్రీ వెంకటశాస్త్రిగా రాదరముతో నాకొసంగ నే నద్దానిని నిదానముగ నవలోకించి యమితానందము నందితిని.

ఈమహాభారత నవనీతకావ్యమును జదివి పీఠికవ్రాసిన కీ॥ శే॥ ఓలేటి వెంకటరామశాస్త్రిగారీగ్రంథ మంటనంటఁ గఠినముగ నున్నటుల సూచించియుండిరి. లోకమున వెన్నగిన్నెలు గట్టివిగానే యుండును; కాని వానిలోనున్న వెన్నమాత్రము సున్నితమై కమ్మఁగఁ గన్పట్టుచుండును. అటులనే నీనవనీతభాజనస్థానీయము లగు పద్యములు కొన్ని క్లిష్టములుగ నున్నను బద్యపాత్త్రాధేయమగు భావనవనీతముమాత్రము తఱచి చూచినకొలఁది మృదుమధురముగఁ గన్పట్టుచున్నది.

ఈకావ్యమునందలి పద్యనిర్మాణనైపుణియు గంగాతరంగిణీవేణివలె వినిర్మలరసభరితమై నిరాతంకగతితోఁ బరువులిడుచున్నది. ఈరీతిఁ బ్రౌఢమార్గమునఁ గవితల వ్రాయఁజాలునొజ్జ లరుదుగఁ గానవచ్చుచున్నారు; కాని విరివిగఁ జూపట్టుటలేదు. శాస్త్రిగారి విజ్ఞానభాగ్యౌన్నతినిఁగూర్చి పండితలోకమున విస్తృతమైయున్నప్రశస్తి యసదృశము.

నిజజనకులు శ్రమఁగొని చిలికి చేఁగూర్చిన మహాభారతనవనీతము నింట దాఁచిపెట్టుకొనక చక్కని సువర్ణముద్రిత పాత్రమున నుంచి యాంధ్రసోదరలోకమున కందిచ్చి నిజనందనపదమును సార్థకముచేసికొన్న శ్రీ ఆకొండి వేంకటశాస్త్రిగారికి ధన్యవాదముల నందఁజేయుచు వారింతటితోఁ దనివినొందింప కుండునటుల నుదారులగు సోదరులు శ్రీ శాస్త్రిగారిని బ్రోత్సహింతురుగావుత.

సాహిత్యవిశారద—కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రి.

# గడియారము

విద్వాన్. వెంపరాల సూర్యనారాయణశాస్త్రి.

---

ఈశబ్దము 'ఘటీయంత్ర'శబ్దభవమని శబ్దరత్నాకరకర్త వైకృతచంద్రికయందుఁ జూపెను. నాదెళ్ల పురుషోత్తమరాయము దానినే యనుసరించెను. యంత్రశబ్దభవములు. జంతిక, జంత్రము. అను రెండు పదములు కనవచ్చుచున్నవి. ఘటికాయంత్రమనినను గొంత బాగుగా నుండెడిది. అట్లుగాక ఘటీయంత్రభవమనుట కొంతదూరముగాఁ గన్పట్టుచున్నది. కారికా, కాఱియ, పీటికా, పీడియము, కన్యకా, కన్నియ, మున్నగుశబ్దములవలె గడియ, ఘటికాశబ్దభవమనుట యుక్తిసహముగా నుండును. ఈవికారములు ప్రాకృతమునుండి కలిగినవనుట న్యాయ్యము.

'కగచజతదపయవాం ప్రాయోలోపః; కాదీనాంనవానాం
వర్ణానాం అనాదావర్తమానానాం ప్రాయోబాహు
ళ్యేన లోపోభవతి, యథాఘటికా, ఘటిఆ.
'టోడః' టస్య అనాదివర్తమానస్య డకారోభవతి. ఘడిఆ.

అని ప్రాకృతప్రకాశికను బట్టి సిద్ధించుచున్నది.

ఈశబ్దమునుగూర్చియే గాథాసప్తశతిలో అర్థభేదేపి రూపైక్యం, కగచజేతిసూత్రేణ అగారః, అఆర భవతి యథాసుపురుషో సూరసో, అనుక్తమన్యశాస్త్రేణేతి న్యాయేన క్వచిత్స్వవర్ణదీర్ఘసంధేర్వ్యవరుచిమతే ఉక్తత్వాత్ ఆరః, ఘడిఆఆర ఇతిస్థితే సమాసేసంధేర్వైకల్పత్వాత్ 'ఘడిఆర' ఇతిరూపం నిష్పన్నమ్. ఘడికాశబ్దస్య 'ఘడిఅ' ఇతిపుంవద్భావః 'ఘడిఅఆరః. అని వ్యాఖ్యాత తెలిపినాఁడు.

కన్నడమున ఈప్రాకృతసంప్రదాయము ననుసరించియే కావచ్చును, అగారశబ్దభవము 'ఆర' అగుననికలదు. కిట్టెలు కన్నడ నిఘంటువున 'ఆర'Thadbhava of ఆగార (Smd 383) A dwelling place See కీరార, కీలార. (క్షీరాగార) కొట్టార (కోష్ఠ-కొట్ట. కర్ణాటకశబ్దానుశాసనమ్) గూఢార, భండార,ధవళార, దేవార, బీడార, అనికలదు.

కర్ణాటకశబ్దానుశాసమున—కీలారశబ్దమును గూర్చి యిట్లున్నది, చూడుఁడు.

"కీలారాదినియమో పదిష్టమ్, కీలారం, కిరారం, దేవారం, ధవళారం, కూడారం ...కూయాణం,‡ కీలారాదిరాకృతిగణః, కీలారం, క్షీరాగారశబ్దే షకారస్య లోపః, రేఫస్యలకారాదేశః, గాపిండస్య అదర్శనమ్, కిరారం, తత్రైవషకారగాపిండయోర్లోపఏవ నరేఫస్యలకారాదేశః, ఉభయథాపిప్రయోగస్యదర్శనాత్" గడియారశబ్దము నోద్దమాత్రము కిట్టిలీ విధానముచూపఁ డయ్యెను. ఘటికాశబ్దభవము 'గడియ' అనియు, ఆగారశబ్దభవము 'ఆర' అనియు నంగీకరించి గడియారశబ్దము దేశ్యమనుట చిత్రము. పూర్వము కాలపరిమాణము తెలిసికొనుటకు, నీటిపాత్రము నందుఁ జిల్లులుగల యొకకుడుక యుంచి చిల్లులవెంబడి నీరుపోసికొని కుడుక మునుఁగఁగానే గడియకాల మైన దని తెలిసికొనెడివారు.

ఆ. గడియకుడుకభంగి గ్రహరాజు జలధిలో, వ్రాలె...సిం. ద్వా. ౪. ౨౩౮.

గీ. గడియకుడుక మునుంగుటగని గురుండు,
  తెల్లవారెడుసని పలు తెంచిపలుక. కువలి. ౨. ౧౨౯.

లోకమునకు ఆకాలపరిమాణము తెలుపుటకై రాజాస్థానములందు వెంటనే శంఖధ్వనిచేయుట కాని గుండ్రమగు పెద్దజేగంటమీఁద నన్నిగడియలు చెల్లినవోయన్ని మాఱులుకొట్టుటగాని సేవకులు జరుపువారు లోపలిగృహము నందైన స్పష్టముగా వినరాదని కోటముందుండు మొగసాలపైని (ముఖశాలపైని) ఎత్తుగా గడియలు తెలుపుటకొక యగారముకట్టి యందాజలయంత్రముంచి తత్సాహాయ్యమున గడియ గడియకు ఘంటాధ్వనులుచేయుచుఁ బ్రాతర్మధ్యాహ్నసాయాహ్నములందు విశేషించి శంఖధ్వనిచేయుచుండువా రన్నట్లు క్రిందిప్రయోగము లవలనఁ దెలియవచ్చుచున్నది, "మధ్యాహ్నశంఖధ్వనిః" అనియు.

సీ. శక్రుగడియారమున మించె శంఖరవము
విబుధలోకంబునందలి వేఁగుఁబోక.

హంసవిలాసము, ౭. ౧౩౮. కలదు.

ఏదియేని వివాహాది శుభకార్యమునకు నిర్ణీతముహూర్తము తెలియుటకై తాత్కాలికముగా గడియారముకట్టి యంత్రము నం దేర్పఱచుచుండువారని యీ క్రిందివీరభద్రవిజయప్రయోగమువలనఁ దెలియ వచ్చుచున్నది.

మ. తమపెద్దింటియరుంగుమీఁదఁ గణఁకధాన్యంబుపైఁ బెండ్లిలగ్న
ముసాధింపఁ బసిండిపెంపున నభోగంగానదీతోయముల్
రమణంబోసి యలంకరించి గడియారంబొప్పఁగట్టించె న
య్యమరాచార్యుని చే మహామహిమతో సర్వప్రతాపంబునన్.

వీర. ౩. ౧౨౪.

ప్రాతర్మధ్యాహ్న సాయాహ్నములందే కాక గడియగడియకు శంఖధ్వనులు తొలుతఁ జేయుచుండువారనియు, బట్టన మంతయు వినవచ్చునట్లు ముఖమారుతముచే నూఁదుట కష్టముకాఁగా ఘంటానినాద రూపమున సులభముగాఁ దెలుపుచుండు వారనియు నూహింపదగు. ఎట్లయినను మహారాజుల కోటమొగసాలపై గడియారముండినట్లును, అం దుండి శంఖారావములో, ఘంటారావములో వినవచ్చుచుండినట్లును నున్న వర్ణనలనుబట్టి గడియారము మొదట అగారమే కాని యంత్రముకా దనవచ్చును. చూడుఁడు.

మ. ఉడువీథిన్ శిఖారావలంబియగు నాంధ్రోర్వీశుమోసాలపై,
గడియారంబునమ్రోసె రెండెనిమిదుల్ ఘంటాఘణత్కారముల్,
సడలెన్ భానుఁడుపశ్చిమంబునకు... క్రీడా. ౧౫౫.

ఉ. ఆనలినాయతాక్షుగడియారమునం దభిసారికాజిఘాం
సానిరత ప్రసూనశరచాపగుణధ్వనులోయనంగ ఘం

టానిసదంబు లయ్యెడ వినంబడియెన్ గుపితాబ్జలోచనా
మానసముల్ చలింపఁ బ్రథమప్రహరాపగమ ప్రశంసులై.

పారి. ౨-౧౦.

క. మునుగడియారంబునఁ గ, ట్టినపెను జేగంటరవము తేయును...

సిం. ద్వా. ౨-౫.

చ. క్రమమున మిత్రమండల మఖండితమండలధామభూమచేఁ
గొమరు వహించెఁ బూర్వగిరికూటమహోన్నతపీఠవాసియై
యమరకులాధినాథసముదంచితపట్టనసౌధమాళియై
యమరెఁ గుఱుందనంపుగడియారపుగంట యనంగ నెంతయున్.

చమత్కా. ౩. ౪౧.

పైప్రయోగములందు గడియారము ఘటికాయంత్రమందు నగారమని స్పష్టమగుచున్నది. క్రమముగా నాయంత్రిమున కాపేరువచ్చినది. చూడుఁడు. చ. జడముడిజాహ్నవీ తట నిశాకరపోతముఁ గాంచి యెవ్వరీ, కొడిమెలుగట్టి పెండ్లికొడుకున్ గడియారము మోవఁ జేసిరందు... హై. భా. ౧. ౨. శివునకు శిరసునగంగ. దానిమీఁదఁ దేలియాడుబాలచంద్రుఁడు. నీటిలోసగముగామునిఁగి సగముపైకిఁ గాన్పించు గడియకుడుకవలెనుండి మొత్తమాసాధనము గడియారముగాఁ జెప్పఁబడెను. దానినుండి యంత్రము అనునర్థమున నిలిచి గడియలుగాక రెండున్నరగడియల కాలముచొప్పునఁ జూపుచున్నను నేఁటిపరదేశప్రేషిత యంత్రమునకును గడియారమను సంజ్ఞవచ్చినది. ఇంకొకచిత్రము ఘంటాధ్వనిలేకున్నను రెండున్నరగడియల కాలమునకు 'గంట' అను నూతనసంజ్ఞతో నొకకాలపరిమితియేర్పడినది.

గడియగడియకు నేదోయొక మార్పుచెందు వస్తువులకును నాపేరుకల్గినది. ఈక్రింది బసవపురాణము. ౧. ౧౦౦౫ లో

ద్వి. "ఒక్కొకగడియ కొక్కొకవండురాలు
నక్కజంబగు గడియారవృక్షములును

నొక్కొకగడియ కొక్కొకమాటు చెలఁగు
నక్కజంబగు గడియారశైలములు."

గడియారపు యంత్రము చేయుపని యీవృక్షములు నీశైలములు చేయుచున్నవి. కాన వానికాపేరు వచ్చియుండును.

ఇన్ని విధములుగా మాఱిన యీ'గడియార' శబ్దవ్యుత్పత్తిని గూర్చి శబ్దరత్నాకరమున నట్లుండెను. ఇఁక సూర్యరాయాంధ్ర నిఘంటువునందు (క. గడియార. త. గడికార. తు. గడియాళ్.) అని చూపఁబడినవేకాని సంస్కృతప్రాకృతములు గ్రహింపఁబడలేదు. వారేకాక విజ్ఞులగు నాంధ్రులెల్లరీ రూపనిష్పత్తియు, నర్థపరిణతియు విమర్శించి న్యాయ్యమైన గ్రహింతురుగాక! నావ్రాఁతయందే దేనిప్రమాదమున్నఁ దెలిపినచో వందనపూర్వకముగా గ్రహించి సవరించికొని తత్త్వము లోకమున కెఱింగింతును.

# మహాకవిప్రయోగసాధనము-మహాభాష్యఫక్కి.

వ్యాకరణ విద్యాప్రవీణ, ఉభయభాషాప్రవీణ,
పోతుకుచ్చి సుబ్రహ్మణ్యశాస్త్రి.



(అనువృత్తము.)

ఉపస్నాతాదులు పంచతీర్థములు. తీర్థస్నానప్రశంసాపర మీ శ్లోకము. "చార్థేద్వన్ద్వః" అను సూత్రములోనికి శేషగ్రహణానువృత్తియే యున్నఁ బై శ్లోకములోని "కృతాకృతే" అను ప్రయోగము కుదురదని యాశంకించి సమానాధికరణసమాస మిది కాకపోవుటచే బాధ లే దనుచున్నాఁడు పతంజలిభగవానుఁడు.

1. "శయానా వర్ధతే దూర్వా"
2. "ఆసీనం వర్ధతే బిసమ్."

"సూ. లక్షణహేత్వోః క్రియాయాః. వా. తత్త్వాన్వాఖ్యానే చ. తత్త్వాన్వాఖ్యానే చోపసంఖ్యానం కర్తవ్యమ్. "శయానా వర్ధతే దూర్వా" "ఆసీనం వర్ధతే బిసమ్." (మహాభాష్యము. 3. ౨. ౨. ౧౨౬)

"తత్త్వాన్వాఖ్యానే చ" అను వార్తికమునకుఁ బై రెండుపాదములనుదాహరణములుగా నొసఁగి సాధించినాఁడు.

"త్రీణి యస్యావదాతాని,
విద్యా యోనిశ్చ కర్మచ।
ఏతచ్ఛివే విజానీహి,
బ్రాహ్మణాగ్ర్యస్య లక్షణమ్." ·

"సూ. పుంయోగాదాఖ్యాయామ్. వా. అవదాతాయాం ఙీప్ప్రసఙ్గః. అవదాతాయాం తు ఙీష్ ప్రాప్నోతి. అవదాతా బ్రాహ్మణీ. "వర్ణాదనుదాత్తాత్తోపధాత్తోన" ఇతి. నైష వర్ణవాచీ. కిం తర్హి విశుద్ధవాచీ, అతశ్చ విశుద్ధవాచీ. ఏవం హ్యాహ, "త్రీణి యస్యావదాతాని, విద్యా

యోనిశ్చ కర్మచ, ఏతచ్ఛివే విజానీహి, బ్రాహ్మణాగ్ర్యస్య లక్షణమ్.
(మహాభాష్యము. ౪. ౧. ౨. ౪౮.)

పై పురాణశ్లోకమునుబట్టి "అవదాతశబ్దము" విశుద్ధవాచకము గల దని "అవదాతా" (బ్రాహ్మణీ) అను ప్రయోగమున జీష్ప్రత్యయము రా దని వారించుచున్నాఁడు.

"క్షేమే సుభిక్షే కృతసంచయాని,
పురాణి రాజ్ఞాం వినయన్తి కోపమ్."

"సూ. సమాసాంతాః. వా. లిఙ్గమశిష్యం లోకాశ్రయత్వాల్లిఙ్గస్య. ఇదం తర్హి ప్రయోజనమ్. ద్విపురీ. త్రిపురీ. ద్విగోరకారాన్తాదితీకారో యథా స్యాత్. ఏతదపి నాస్తి ప్రయోజనమ్, పురశబ్దోఽయమకారాన్తస్తేన సమాసో భవిష్యతి, అతశ్చాకారాన్తః, ఏవం హ్యాహ-"క్షేమే సుభిక్షే కృతసంచయాని, పురాణి రాజ్ఞాం వినయన్తి కోపమ్ ఇతి." (మహాభాష్యము. ౫. ౪. ౧. ౬౮.)

పురశబ్ద మకారాన్త మనుట కీకావ్యప్రయోగమును బ్రమాణముగాఁ బ్రదర్శించుచున్నాఁడు.

"ప్రస్థే హిమవతశ్శృఙ్గే."

"సూ. గ్రహవృదృనిశ్చిగమశ్చ. వా. ఘఞర్థే కవిధానంస్థాస్నాపావ్యధిహనియుధ్యర్థమ్. ఘఞర్థే కో విధేయః, కిం ప్రయోజనమ్, స్థాస్నాపావ్యధిహనియుధ్యర్థమ్, స్థా-ప్రతిష్ఠన్తేఽస్మిన్ ధాన్యానీతి ప్రస్థః-"ప్రస్థే హిమవతశ్శృఙ్గే". (మహాభాష్యము. 3. 3. ౧. ౫౮.)

పై వార్తికమునకు లక్ష్య మీమహాకవిప్రయోగ మనుచున్నాఁడు.

"గౌరివాకృతనీశారః ప్రాయేణ శిశిరే కృశః."

"సూ. ఇజశ్చ. వా. శ్యా వాయువర్ణనివృతేషు. శ్యా ఇత్యేతస్మాద్వాయువర్ణనివృతేషు ఘఞ్ వక్తవ్యః, శారో వాయుః, శారో వర్ణః. "గౌరివాకృతనీశారః, ప్రాయేణ శిశిరే కృశః" (మహాభాష్యము. 3 3. ౧. ౨౧.)

‘శౄ’ధాతువున కాచ్ఛాదనార్థమున‘ఘఞ్’ప్రత్యయము విధించి శారశబ్దమునుసాధించిపై ప్రయోగములోని “అకృతనీశారః” అనుదానికి “అకృతాచ్ఛాదనః” అని యర్థ మనుచున్నాఁడు.

1. “అసిద్వితీయోఽనుససార పాణ్డవమ్”

2. “సంకర్షణద్వితీయస్య బలం కృష్ణస్య వర్ధతామ్.”

“సూ. అనేకమన్యపదార్థే. వా. అవయవేన విగ్రహాస్సముదాయస్య సమాసార్థః. యద్యవయవేన విగ్రహాస్సముదాయస్య సమాసార్థః “అసిద్వితీయోఽనుససార పాండవమ్” “సంకర్షణద్వితీయస్య బలం కృష్ణస్య వర్ధతామ్” ఇతి. ద్వయోర్ద్వివచనమితి ద్వివచనం ప్రాప్నోతి...నైష దోషః. అయం తీయాన్తశ్శబ్దోఽస్త్యేవ పూరణే వర్తతే. అస్తి సహాయవాచీ. తద్యస్సహాయవాచీ తస్యేదం గ్రహణమ్.అసిద్వితీయః అసిసహాయ ఇతి గమ్యతే” (మహాభాష్యము. ౨. ౨. ౨. ౨౪)

“అసిద్వితీయః” సంకర్షణద్వితీయస్య”—అను పైప్రయోగములలోనిద్వితీయశబ్దము సహాయవాచక మని వ్యాఖ్యానించినాఁడు.

“జనార్దనస్త్వాత్మచతుర్థ ఏవ.”

“సూ.అజ్ఞాయినిచ. కథం “జనార్దనస్త్వాత్మచతుర్థ ఏ”వేతి. బహువ్రీహిరయమ్, ఆత్మా చతుర్థోఽస్యేతి”. (మహాభాష్యము. ౬. ౩. ౧. ౫.)

“ఆత్మనశ్చ”అనుసూత్రమునఁ దృతీయావిభక్తికి అలుక్కు వచ్చి “ఆత్మనా చతుర్థః” అని కావలసి యుండ ‘ఆత్మచతుర్థః’ అను మహాకవి ప్రయోగ మెట్లు సాధు వని ప్రశ్నించి “ఆత్మాచతుర్థోఽస్య” అను విగ్రహముచే బహువ్రీహిసమాసము గావున నలుక్కురా లేదని సాధు వనుచున్నాఁడు.

“తుతోజ శబలాన్ హరీన్.”

“సూ.తుజాదీనాం దీర్ఘోభ్యాసస్య—వా. తుజాదిషు చ్ఛన్దఃప్రత్యయగ్రహణం వక్తవ్యమ్. ఛన్దసితుజాదీనాం దీర్ఘో భవతీతి వక్తవ్యమ్.అస్మిం

శ్చాస్మింశ్చ ప్రత్యయ ఇతి వక్తవ్యమ్. ఇహ మా భూత్-"తుతోజ శబలాన్ హరీన్." (మహాభాష్యము. ౬. ౧. ౧. ౭)

వింటిరా! మహాభాష్య మే మనుచున్నదో "తుతోజ శబలాన్ హరీన్" అనుమహాకవిప్రయోగము కుదురుపడుటకు "తుజాదీనాం దీర్ఘోఽభ్యాసస్య" అనుసూత్రమున ఛన్దోగ్రహణ మావశ్యక మను చున్నది.

"ఆత్మమ్భరిశ్చరతి యూథమసేవమానః"

ఈమహాకవిప్రయోగము "భృఞః కుక్ష్యాత్మనోర్మ్ముమ్చ"- అను వార్తికమున కుదాహరణముగా మహాభాష్యమునఁ బ్రదర్శింపఁబడినది. (చూ. సూ.ఫలేగ్రహిరాత్మమ్భరిశ్చ. మహాభాష్యము. ౩.౨.౧.౨౬.)

" ఇహైవ భవ మా స్మ గాః"

"అత్రైవ త్వమిహ వయం సుశేవాః"

మహాభాష్యకర్త "ఏవే చానియోగే" అను వార్తికములోని "అనియోగే" గ్రహణము పైమహాకవిప్రయోగములలోని "ఇహైవ.-అత్రైవ" అనువానికి సాధుత్వము నుపదేశించుటకే యనుచున్నాఁడు.

"సూ.ఏఙిపరరూపమ్—వా. ఏవే చానియోగే. ఏవే చానియోగే పరరూపం వక్తవ్యమ్. ఇహ+ఏవ - ఇహేవ. అద్యేవ. అనియోగ ఇతి కిమర్థమ్? "ఇహైవ భవ మా స్మగాః" "అత్రైవ త్వమిహ వయం సుశేవాః" (మహాభాష్యము. ౬. ౧. ౪. ౯౪)

"జఘాన కంసం కిల వాసుదేవః"

"సూ.అనద్యతనే లఙ్—వా. పరోక్షే చ లోకవిజ్ఞాతే ప్రయోక్తుర్దర్శనవిషయే. పరోక్షే చ లోకవిజ్ఞాతే ప్రయోక్తుర్దర్శనవిషయే లఙ్ వక్తవ్యః. అరుణద్యవనస్సాకేతమ్. అరుణద్యవనో మధ్యమికామ్. పరోక్ష ఇతి కిమర్థమ్. ఉదగా దాదిత్యః. లోకవిజ్ఞాత ఇతి కిమర్థమ్. చకార కటం దేవదత్తః. ప్రయోక్తుర్దర్శనవిషయ ఇతి కిమర్థమ్ "జఘాన కంసంకిల వాసుదేవః. (మహాభాష్యము. ౩. ౨. ౨. ౧౧౧)

పైమహాకవిప్రయోగమునఁ బ్రయోక్తకుఁ గంసవధము దర్శన విషయము కానందునఁ బైవార్త్తికముచొప్పున 'లజ్' ప్రయోగ మనుపపన్నమై "పరోక్షే లిట్" అనుసూత్రమున 'లిట్' ప్రయోగ మేర్పడినదని మహాభాష్య మనుచున్నది.

"ప్రథతే త్వయా పతిమతీ పృథివీ"

"సూ. అంతర్వత్పతివతోర్నుక్ — వా. అన్తర్వత్పతివదితిగర్భభర్తృసంయోగే"- అన్తర్వత్పతివదితి గర్భభర్తృసంయోగ ఇతి వక్తవ్యమ్. ఇహమా భూత్- "ప్రథతే త్వయా పతిమతీ పృథివీతి" (మహాభాష్యము. ౪. ౧. ౨. ౩౨)

పైవార్త్తికమున 'భర్తృసంయోగే, అనునది లేకున్నఁ బైమహాకవిప్రయోగము- భర్తృసంయోగము లేనిసందర్భములోని 'పతిమతీ' అనునది-యసాధు వగును. కావున భర్తృసంయోగమున 'పతివతీ' అనునది సాధు వనియు, భర్తృసంయోగము లేనిసందర్భమున "పతిమతీ" అనునదియే సాధు వనియు బోధించుపై మహాకవిప్రయోగము సాధు వనుటకు వార్త్తికమున "భర్తృసంయోగే" అనునది యావశ్యక మని మహాభాష్యకర్త యనుచున్నాఁడు.

ఇట్లు మహాకవిప్రయోగము లనేకములు మహాభాష్యమున సాధింపఁబడి యున్నవి. గ్రంథ మధికముగాఁ బెరిఁగినను నీమహాకవిప్రయోగముల సాధించినమహాభాష్యఫక్కి యెట్టిదియో పాఠకలోకము గుర్తెఱుఁగుటకు మహాభాష్యపంక్తులు సయుక్తము వీ లగునంతవఱకు నుదాహరించితిని. 'ఈమహాభాష్యఫక్కి పాణినీయము కావ్యభాషానుశాసకము కా దనువిపరీతనిశ్చయము గలిగించుచున్న' దని శ్రీశాస్త్రిగా రనినారు. పాఠకులారా! యీసందర్భమున నాయుదాహరించిన మహాభాష్యభాగముల నెల్ల సమగ్రముగా నవలోకించినమీ కిప్పు డట్టినిశ్చయమే కలిగినదా? ఏయొకకవిప్రయోగమునో మహాభాష్యకర్త 'ఛాందసత్వా

ద్భవిష్యతి' అని ప్రమాద మనినంతమాత్రమునఁ బాణినీయము కావ్యభాషానుశాసకము కాకపోవునా? సాధుశబ్దములనుండి యపశబ్దములను వేఱుపఱుచుట వ్యాకరణకర్తలకృత్యములలో నొకటి. అట్టికృత్యమున శాస్త్రకర్తలు జాగరూకత వహించినప్పు డది 'పాణినీయము కావ్యభాషానుశాసక' మని నిరూపింపఁ గలుగునే కాని కా దనువిపరీతనిశ్చయము కలిగింప లేదు. ఒకవేళ 'ఛాందసత్వాద్భవిష్యతి' అనుభాష్యమును బట్టి శ్రీ శాస్త్రిగారు నిర్ణయించిన 'పాణినీయము కావ్యభాషానుశాసకము కా'దనువాదమునే మనము నంగీకరింపఁ దలచినను బైరీతిని జర్చాపూర్వకముగా ననేకమహాకవిప్రయోగములు సాధించినపతంజలి భగవానుఁ డంగీకరింపఁడు. కావున నేవిధముగాఁ జూచినను శ్రీ శాస్త్రిగారివాదము దుర్బల మని యంగీకరింపక తప్పదు.

---

# సర్వజనవ్యవహారభాష-వ్యాకరణసమ్మతి.

శ్రీ శాస్త్రిగారిట్లు వ్రాయుచున్నారు. 'జనసామాన్యవ్యవహారభాష-బజారుభాష - వ్యాకరణసమ్మతమును గ్రాంథికమును నైయుండుట యేకాలమందును నేదేశమందును నశ్రుతచరము. ఈయభిప్రాయము నేనే గాక భాషాశాస్త్రజ్ఞు లెవ్వరును సమ్మతింపఁజాలరని నా నమ్మకము. (అనుబంధము. ౧. పా.)

ఇఁక నీవిషయమును గూర్చి విమర్శింతము. భాష యనునది వ్యవహారార్థ మేర్పడునది యని భాషాశాస్త్రజ్ఞు లెల్లరు నంగీకరించిరి. భాషాలక్షణప్రకారము భాష యనునది లోకవ్యవహారార్థమైనప్పుడు మనుముందేభాషయైనను వ్యవహారముకొఱకు స్వస్వరూపముతోడనే- అనఁగా సాధుశబ్దములతోడనే-యేర్పడు ననక తప్పదు. అపశబ్దకలుషిత మగువాఙ్మయమే లేనియానాఁడు సాధుశబ్దమయ మగునాభాషయే సర్వజనవ్యవ

హారభాషగా-అనఁగా బజారుభాషగా-నున్నదనుట నిర్వివాదాంశము. తరువాతఁ గొంతకాలమున కీభాష వక్తలయుచ్చారణవైషమ్యము మొదలగుభాషావిపరిణామకారణములవలన వివిధవికారములతో విపరిణామము చెంద నారంభించును. అట్టిసమయమున నపభ్రంశకలుషితముగాని సాధువాఙ్మయ మేదియో నిరూపించుటకు వ్యాకరణము లావశ్యకము లగును. ఇట్లేర్పడినవ్యాకరణము లితరవ్యవహారములయందువలె నాఁడు సాధుశబ్దములతో నిండియున్న సర్వజనవ్యవహారమును- బజారుభాషను- గూడ ననుశాసింపక మానవు. భాషాశాస్త్రజ్ఞపథమున కిది విరుద్ధము గాదు. సంస్కృతమునకు మునిత్రయము వా రేర్పఱచినవ్యాకరణ మిట్టిదియే. సకలవాఙ్మయమును జక్కఁగాఁ బరిశోధించి యనన్యసాధారణమగులక్షణ మేర్పఱచిన పతంజలిభగవానునికంటె నెక్కుఁడగుభాషాశాస్త్రజ్ఞుఁ డీభాషకు మఱియొకఁడు లేఁడు. ఇతఁడు పైని నానిరూపించిన విషయమున కంతకు నెట్లు ప్రత్యక్షసాక్ష్యము నిచ్చుచున్నాఁడో, తిలకింపుఁడు మొట్టమొదట సర్వజనవ్యవహారముకొఱకుఁ బరమేశ్వరసంకేతముగా నేర్పడినది సంస్కృతభాష. అది యశక్తోచ్చారణాదిభాషావిపరిణామకారణములవలనఁ గ్రమక్రమముగా మాఱుచు వచ్చినది.

(ఌకారోపదేశః) "అశక్తిజానుకరణార్థః. అశక్త్యా కయాచిద్బ్రాహ్మణ్యా 'ఋతక' ఇతి ప్రయోక్తవ్యే 'ఌతక' ఇతి ప్రయుక్తమ్. తస్యానుకరణమ్. బ్రాహ్మణ్యౢతక ఇత్యాహ, కుమార్యౢతక ఇత్యాహేతి" (మహాభాష్యము. ౧-౧. ఋఌక్ సూత్రము) ఇఁక భాష్యాభిప్రాయమును వ్యక్తీకరించుచు శబ్దకౌస్తుభముకూడ నిట్లు చెప్పినది. "అనిదంప్రథమాశ్శబ్దాస్సాధవః పరికీర్తితాః, త ఏవశక్తివైకల్యప్రమాదాలసతాదిభిః. అన్యథోచ్చారితాః పుమ్భిరపశబ్దా ఇతీరితాః" (శబ్దకౌస్తుభము. ౮౨ పు.) సంస్కృతశబ్దముల కపభ్రంశములుగాఁ బ్రథమమునఁ బ్రాకృతాదు లేర్పడినవి. "గౌరిత్యస్య శబ్దస్య-గావీ గోణీ గోతా గోపోతలికేత్యేవమాదయో బహవోఽపభ్రంశాః. (మహాభాష్యము. ౧. ౧. పస్పశాహ్ని

కము.) సాధుశబ్దముల నిరూపించి యపభ్రంశములఁ బోఁద్రోయుటయే వ్యాకరణమునకుఁ గర్తవ్యము. "సమానే చార్థే శాస్త్రాన్వితస్య నివర్తకో భవతి. తద్యథా-దేవదత్తశబ్దః దేవదిణ్ణశబ్దం నివర్తయతి." (మహాభాష్యము. ౧. ౧. ఋ ఌ క్ సూత్రము.) మహాభాష్యకర్త పై నుదాహరించిన యపభ్రంశరూపములు ప్రాకృతాదిభాషలలోఁ గలవని భాషాశాస్త్రజ్ఞులే యనుచున్నారు. ఇఁక మహాభాష్యకర్త యుదాహరించిన సూతవైయాకరణసంవాదమును బరిశీలింపుఁడు.

సూ. "అజేర్వ్యఘఞపోః. ఏవంహి కశ్చిద్వైయాకరణ ఆహ. కోఽస్య రథస్య ప్రవేతేతి. సూత ఆహ. ఆయుష్మన్నహ మస్య రథస్య ప్రాజితేతి. వైయాకరణ ఆహ. అపశబ్ద ఇతి. సూత ఆహ-ప్రాప్తిజ్ఞో దేవానాంప్రియో న త్విష్టిజ్ఞః. ఇష్యత ఏతద్రూపమితి, వైయాకరణ ఆహ-అహోనుఖల్వనేన దురితేన బాధ్యామహే ఇతి సూత ఆహ. నఖలు వేఞః సూతః. సువతేరేవసూతః. యది సువతేః కుత్సా ప్రయోక్తవ్యా దుస్సూతేనేతి వక్తవ్యమ్" (మహాభాష్యము. ౨. ౪. ౧. ౫౬. ఈసందర్భమున శ్రీ శాస్త్రిగారనుబంధములో "ఇక్కడి సూతుఁడు సైతము శిష్టుఁడేకాని సామాన్యజనుఁడు కాఁడు" (అనుబంధము. ౨. పే.) అనిరి. సూతుఁడు శిష్టుఁడైన నేమి ? "కోఽస్య రథస్య ప్రాజితా" (ఈబండి తోలువాఁ డెవఁడు) అని వైయాకరణుఁడు రథచోదకు లందఱఁ గూర్చి మొట్టమొదట సంస్కృతముతో నుపక్రమించినయుపక్రమణమే యాకాలమున సంస్కృతభాష సర్వజనవ్యవహారోపయోగి భాషగా నుండెడిదని స్పష్టీకరించినది. తరువాత జరిగినసూతవైయాకరణసంవాద మపశబ్దకలుషిత మగువాఙ్మయ మానాఁడు సర్వజనోపయోగిభాష-బజారుభాష-లో సైత మాక్షేపాపాదకముగా నుండెడి దని స్థిరీకరించుచున్నది.

ఇంకొకవిశేషము. శిష్టుఁ డైనను సూతుఁ డిటఁ జేయునది రథచోదనాకృత్యము గాని వైదికకర్మోపయోగివ్యవహారము గాదు. ఇట్టియెడ

శ్రీ శాస్త్రిగారిసిద్ధాంతప్రకారము వైదికలౌకికయోగిశిష్టవ్యవహారభాషామాత్రానుశాసకము కాఁ దగినపాణినీయము లోకవ్యవహారభాష - బజారుభాష - నె ట్లనుశాసింపఁగలిగినది ? అపశబ్దములు కావ్యములలో నయితము దుష్టములు గావని శ్రీశాస్త్రిగా రనునప్పుడు లోకవ్యవహారభాష—బజారుభాష—లోఁ గూడ నపశబ్ద ముపయోగింపఁ గూడ దని వైయాకరుణుని సూతుఁ డెట్లాక్షేపింపఁ గలిగెను? వైయాకరణుఁ డైన నది గాఁదనక సమ్మతించి సమాధాన మెట్లొసఁగెను? అను వాని కిట శ్రీ శాస్త్రిగారు ప్రత్యుత్తరింపవలసి యున్నారు. ఇఁకఁ బ్రకృతమునకు వత్తము. ఇట్లు మహాభాష్యకర్త యీసూతవైయాకరణసంవాదము నుదాహరించి సంస్కృతము సర్వజనోపయోగిభాషగా నుండెడి దనియుఁ బాణినీయము దానిని నయిత మనుశాసించియున్న దనియు మనకెఱుకపఱచినాఁడు. కావునఁ బైని నిరూపించినరీతిని జనసామాన్యవ్యవహారభాష- బజారుభాష - వ్యాకరణ సమ్మత మగుట విరుద్ధము గాదు. ఇఁక నీభాష గ్రాంథిక మెట్లగునో పరిశీలింతము. భాష లన్నియు స్వస్వరూపములతో నలరారుచుండెడినాఁడు- అపశబ్దకలుషిత మగు వాఙ్మయమే లేనినాఁడు-గ్రాంథికభాషయు జనసామాన్య వ్యవహారభాషయు నొక్కటిగా - అనఁగా నెట్టివైలక్షణ్యమును లేక - వెలసియుండుట విప్రతిపన్నము గాదు. అటుతరువాత స్వస్వరూపముతో గ్రంథస్థముగా నిలిచి యాభాషయే గ్రాంథిక మనఁబడును. అదియే జనసామాన్యముచే వ్యవహరింపఁబడుచు నానాఁటికి వివిధము లగువికారముల నంది యపభ్రంశబహుళమై వ్యావహారికభాషగాఁ బరిగణింపఁబడును. కొన్నినాళ్ళ కది స్వస్వరూపపరిజ్ఞానమే లేనివివిధపరిణామముల కాకరమై భాషాంతరములుగాఁ గూడఁ బరిగణింపఁబడును. ఇఁక గ్రాంథికభాష ప్రాథమికావస్థలో నపశబ్దకలుషితము గానిశుద్ధ మగుస్వస్వరూపముతో నేర్పడి వ్యాకరణాపేక్ష లేనిదియే యైనను జనసామాన్యవ్యవహారభాషతో లోకవ్యవహారము నడపికొనువా రగుటచేఁ దరువాతివా రీభాష నుపయోగించునప్పుడు

జనసామాన్యవ్యవహారభాషలోని యపభ్రంశములు గొన్ని దీనిలోఁ గూడఁ బ్రమాదపతితములుగా సంభవించును. ఇవియే కవిప్రమాదము లని మన మనుచున్నాము. అట్టియపభ్రంశములను ద్రోసి సాధు శబ్దములను నిరూపించుట కీభాషకును వ్యాకరణాపేక్షకలుగును. ఈ యపభ్రంశములను గూడ వ్యాకరణము సాధింపవలె నని శ్రీశాస్త్రిగారు వాదులాడుచున్నారు. కాని యపశబ్దములను సాధుశబ్దములనుగా సాధించుట వ్యాకరణములపని కాదు. సాధుశబ్దముల నిరూపించి యిట్టియపభ్రంశముల నిరాకరించుటయే వ్యాకరణమునకుఁ గర్తవ్యము.

సంస్కృతము - తన్నామ వివరణము.

ఇఁక నీభాషకుఁ బురాతనముగా నేర్పడియున్న సంస్కృతమను నామమును బురస్కరించుకొని యిది ప్రాకృతాదులనుండి సంస్కరింపఁ గాఁ గలిగినవాఙ్మయ మని కొందఱు భాషాశాస్త్రజ్ఞు లభిప్రాయపడిరి. కాని పాణిని సంపూర్వక మగు 'కృఞ్' ధాతువున కలంకారాద్యర్థముల యందు సుడాగమము విధించినాఁడు. 'సూ. సంపరిభ్యాం కరోతౌ భూషణే సంస్కరోతి. అలఙ్కరోతీత్యర్థః" (సిద్ధాంతకౌముది.) కావున దీనినిబట్టి నియమాదులచే బాగుగా నలంకరింపఁబడిన దగుటచేఁ బురాతనముగా నీభాష కీనామము సిద్ధించిన దనుటయే ప్రామాణికాభ్యుపగతము సహృదయసమ్మతము నయి యున్నది. ఇఁక నప్రకృతము నావలకుఁ ద్రోయుదము. ఇట్లు వస్తుస్థితిని బరిశోధించిన లోకవ్యవహారభాష యొకప్పుడు వ్యాకరణసమ్మతమును గ్రాంథికము నగుట గీర్వాణభాషాసంప్రదాయప్రకారము విరుద్ధము కాదు. భాషాశాస్త్రజ్ఞు లన నేల ప్రామాణికమూర్ధన్యుఁ డగుమహాభాష్యకర్తయే యీవాదము నంగీకరించి హస్తావలంబన మిచ్చినాఁడు. ఇఁక జనసామాన్యభాష యొకకాలమున గ్రాంథికమును వ్యాకరణసమ్మతమును నగుట యశ్రుతచరమో శ్రుతచరమో ప్రాజ్ఞు లూహింతురుగాక.

# లౌకికవాఙ్మయము-తద్భేదకారణములు.

మానవసహజము లగు నేకొలఁది ప్రమాదములో గలిగినప్పుడు భాష కది యొకవైలక్షణ్య మనుకొని యనంతము లగు భాషావిభాగము లేర్పఱచుటయు వానికన్నిటికి నొక్కొక్క వ్యాకరణము గావలసియుండు ననుటయు నసమంజసము లని యిదివఱకు నావ్యాసములో నిరూపించి యున్నాను. (చూ. ౧౯-౩౭ భారతి) దాని కిసమాధానముగా ననుబంధములో "శిష్టలోకభాషకును, వైదికభాషకును వేర్వేఱుగ లక్షణరచనము చేసిన పాణినిమునియే యిందులకు సమాధానము చెప్పుకొనవలసియుండును." (అనుబంధము. ౯ పు) అని శ్రీ శాస్త్రిగారు ప్రత్యుత్తరించిరి. ఈసందర్భమునఁ బాణినిముని నాకు సమాధానము చెప్పలేదు గాని పతంజలిముని ప్రత్యుత్తర మిచ్చినాఁడు. "సహిచ్ఛన్దాంసి క్రియన్తే। నిత్యానిచ్ఛన్దాంసీతి. (మహాభాష్యము. ౪. ౩. ౧ ౧౧౧) శాస్త్రకర్తలు శ్రీ శాస్త్రిగారివలె నేపాశ్చాత్యానుసారముగా నో మూల ప్రాకృతమునుండి సంస్కరింపఁబడినది వైదికభాష యని వంశవృక్ష మొకదానిని నిర్మింపఁ దలపెట్టినవారు కారు. వైదికవాఙ్మయ మపౌరుషేయ మని వారియాశయము. పై మహాభాష్యపంక్తు లట్టియాశయమునే విశదీకరించినవి. పురుషనిర్మితముగాక యనాదిగా నేర్పడియున్న యీవాఙ్మయమునఁ బ్రమాదము లున్న వనుటకు వారు సాహసించినవారు గారు. అందుమూలమున నం దేదియున్నను నది శిరసావహించి తాము లక్షణ మేర్పఱచుకొనవలసినవారైరి. ఇట్టిప్రామాణ్య మైనను సంహితాదిభాగములకే వారొసఁగిరి. పదము జట మొదలగు వైదికభాగమును లౌకికవాఙ్మయముతో పాటు కృతకముగనే వారు భావించిరి. ఇట్టివైలక్షణ్య ముండుటనుబట్టియే శాస్త్రకర్తలు లౌకికవాఙ్మయమునకంటె వేఱుగా వైదికవాఙ్మయమునకు లక్షణ మేర్పఱుపవలసినవారైరి. అట్టివైలక్షణ్య మేదియుఁ గావ్యవాఙ్మయమునకు నితరవాఙ్మయమునకును గానరాదు. భారతాదిభాషను గ్రాంథికభాష యని శాస్త్రిగారు వ్యవహరించిరి. ఇఁకఁ బరిశిష్టన్యాయమునఁ గావ్యభాష గ్రామ్యభాష యగుచున్నది. అది గ్రాంథిక మగుటకును నిది గ్రామ్య మగుటకును దగుకారణము లేవియు నాకగపడలేదు. శ్రీ శాస్త్రిగారే యాకారణముల నిరూపింపవలసియున్నారు.

# " పరహితవిద్య ", " పరహితక్రమము "

## అనఁగా వైద్యశాస్త్రవిధానమా ?

డి. వి. సుబ్బారెడ్డి.

1. పై ప్రశ్న నామనసులో నంకురించుటకును, నే నాప్రశ్నను బండితుల నడుగుచుండుటకును బీజము బైచరాజు వెంకటనాథుని పంచతంత్రమందలి యొకపద్యరత్నము. కవి, మందవిదుఁ డనుచిలువ మండూకపతిని మోసముచేసినకథను జెప్పుచున్నాఁడు. భూదేవకుమారకుని కఱచినందులకు బ్రాహ్మణోత్తముఁడు కోపించి పల్కినపరుషభాషణములని పాము కప్పతోఁ జెప్పినమాటలుగల ఆటవెలది యిది.

> "కుటిలగతికిఁ, బుట్టుగ్రుడ్డికి, ననుదినశ్రుతివిహీనునకును, గ్రూరమతికి
> బాపజాతి కేల ప్రాప్తించుఁ, బరహితాచరణవిద్య, నిన్ను సైపఁదగునె !
>
> (౩. ఆశ్వా. 354. ప.)

ఇఁక, ఆవసుధామరుఁడు సామాన్యుఁడుగఁ దోఁచుటలేదు! ధైర్యస్థుఁడు మాత్రమేకాదు. పాముకాటునుండి ప్రాణుల రక్షింప సమర్థుఁడుఁ గూడ. అందువలననే, తనపట్టిని జడియకుమని వీపు తడవినాఁడు. పామును జీవాళ్లుపెట్టి శపించి, తఱిమివేసినాఁడు. సర్పవిద్యవలనఁ బరహితమొనర్చువాఁడు కాఁబోలు !

2. "పరహితము" అనఁగా ఇతరులకు "మేలు" అని నిఘంటువులలోనుండవచ్చును. పరహిత మనేకరూపములఁ దాల్పవచ్చును. జలజనితవిషము వేడిమికి మాడుచు, ప్రజాపతిముఖ్యులు మొఱపెట్టిన, లోకహితార్థము, ఆర్తులరక్షించుకోర్కెతో హాలాహలమును మ్రింగఁబూనిన హరునిసుభాషితతారావళిలో నొకపద్యమున, పోతన పరహితమును బ్రస్తుతించినాఁడు. ఇచట పరహితము, శివుఁడు విషముమ్రింగి, విషవహ్నినుండి ప్రాణుల రక్షించుటయే కదా! విషవిద్య నెఱిఁగి, విషవికారములను, అపాయములను తగ్గింపను, చికిత్సచేయను శక్తిగలవారు పరహితులుగదా ! స్వలాభమును, స్వసుఖమును, స్వప్రాణమును లెక్కింతురా పరహితచిత్తులు ?

> పరహితము సేయ నెవ్వఁడు పరమహితుండగును భూతపంచకమునకుం
> బరహితమె పరమధర్మము పరహితునకు నెదురు లేదు పర్వేందుముఖీ.
>
> (స్కం. 2. 368. ప.)

3. తెలుఁగుదేశపుశాసనములలోఁ గొన్నిశాసనములవలన (అని తల్లిశాసనము 'కలువచెఱువుశాసనము' మొదలగునవి) రెడ్డిరాజుల కాలమున 14,15 శతాబ్దములలో నొక విప్రకుటుంబమువారు, సుప్రసిద్ధపండితులుగ నుండినట్లును, వారిలోఁ గొందఱు భూతదయార్ద్రహృదయులై, మానవులకే గాక, సర్వములకును బాధ నివారణచేసినట్లును, అనేకప్రాణులఁ గాపాడినట్లును, ఇట్టిపరోపకారమునకై పాలకులనుండియు, రాజబంధువులనుండియు, మర్యాదలు, దానములు పొందినట్లును దెలియవచ్చుచున్నది. తరతరము వీరిపూర్వికులు, అనుదినము వీరు చేయుచుండినలోకహితైకకార్యపరంపరలప్రాశస్త్యముచే, ఆకాలమునాఁటికి నీవంశమువారు పరహితవంశము వారనియు వీరికుటుంబములోని ప్రసిద్ధపండితులు పరహితాచార్యులనియుఁ బిలువబడుచుండిరి. పరహితపండితులలోఁ గొంద ఱాయుర్వేదాచార్యులు, అపరధన్వంతరులు.

సర్పవిద్య, (పాముకాటునుండి జనులరక్షించుట) విషవిద్య (విషప్రయోగమువలనఁ గలుగుహానిని బోఁగొట్టుట) కాయచికిత్స (దేహామందలిజబ్బులబాధల నివారించుట) శల్యచికిత్స (ముండ్లబాణములఁదీయుట) మొదలగు పద్ధతు లన్నియుఁ బరహితచర్యలు గదా ! పోతన, వెంకటనాథుఁడు పరహిత మనుపదమును బ్రయోగించునపుడు పరహితవంశము జగత్ప్రసిద్ధి చెందియుండెనుగదా! పోతన విషము మ్రింగినవైద్యనాథుని పరహితబుద్ధినిఁ బొగడినాఁడు. వెంకటనాథుఁడో పాముల విషమునుండి జనుల రక్షించుబ్రాహ్మణునిపరహితాచరణవిద్యను దడవినాఁడు.

4. రమారమి 7 లేక 8 సంవత్సరముల క్రిందట నేను బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారితోఁ దెలుఁగుదేశపు నాయుర్వేదవాఙ్మయమును గుఱించి మాటలాడుసందర్భమున వారు మద్రాసు ఓరియంటల్ లైబ్రరీలో ప్రాచీనాయుర్వేదగ్రంథ మొకటి కల దని చెప్పిరి. మఱికొంత ప్రశ్నింపగా నాగ్రంథముపేరు "పరహితసంహిత" యని తెల్పిరి. మొట్టమొదట పరహితవంశముయొక్క సుచారిత్రమును నా కెఱింగించినదియు శాస్త్రులుగారే. అప్పటినుండి యాగ్రంథమును జూడవలె నని

యు నందలి వివిధవిషయములను బట్టిక క్రింద తయారుచేయవలె ననియుఁ జాలఁగుతూహలపడితిని. నాదురదృష్టమున నేను మఱుసారి మద్రాసుచేరి ఓరియంటల్ లైబ్రరీకి పోవునప్పటికి నాకుఁ దగినవసతులు లేకుండెను. ఆ గ్రంథము, నందినాగరిలిపిలో వ్రాయఁబడియుండుటవలన నాకు నగమ్య గోచరముగ నుండెను. జిలుగు నాగరి వ్రాఁత నెఱింగిన పండితులసన్నిధి యవసర మయ్యెను. అంతటితో నుత్సాహము కొంచెము తగ్గెను.

5. ఇంకొకసారి మద్రాసు పోయినపుడు, మిత్రులును, సుప్రసిద్ధ చారిత్రకపరిశోధకులును నగు డాక్టర్ వెంకటరమణయ్యగారు నాప్రశ్నలకుఁ గొన్నింటికి జవాబు లిచ్చుచు, "పరహితసంహిత" యనఁబడు ప్రాచీనాయుర్వేదగ్రంథమును వావిళ్ల వారు ప్రకటించుటకుఁ బ్రయత్నము చేయు చున్నారనిరి. నేను వావిళ్ల వారిపుస్తకవిక్రయశాలకుఁ బోయి యంగడిలోని యాయుర్వేదగ్రంథముల నన్నింటిఁ జూచితిని. కొంటిని. క్యాటలాగులో మాత్ర మీ మాట లుండెను. "పరహితము- ప్రాచీనాయుర్వేదగ్రంథము- అచ్చగుచున్నది." ఇంకొకసంవత్సరముగడచిన తఱువాఁత, మరల వావిళ్ల వారి యంగడికిఁ బోయి, అచ్చుపూర్తిఅయినదా యని అడుగఁగా, అచ్చు మొదలు పెట్టలే దని తెలిసెను. అపుడు శ్రీవావిళ్ల వెంకటేశ్వరులతో ఫోనులో మాట్లాడితిని. తరువాత, ఉభయులకు మిత్రులును, ఆప్తులును, అగు ప్రొఫెసర్ మామిడిపూడి వెంకటరంగయ్యగారి ద్వారాను, శ్రీ బెజవాడ రామచంద్రా రెడ్డిగారిద్వారాను, ఆ "పరహిత" మును దెప్పించి, చదివి చూడఁ బ్రయత్నించితిని. జయపూరుసంస్థానాధీశ్వరులు, కళాప్రపూర్ణులు, డాక్టరు శ్రీశ్రీశ్రీ విక్రమదేవవర్మమహారాజులుంగారును, నేను నీగ్రంథముకొఱకుఁ జూపునాతురతను, పడినపాట్లను గమనించి, శ్రీవారే శ్రీవావిళ్ల వెంకటేశ్వరులతో మాట్లాడి గ్రంథము తెప్పించెద మనిరి. ఇంతలో, యుద్ధపరిస్థితులు విషమించెను.

ఇప్పటికి నేను విన్నంతవఱకు, పంతులుగారు తమయొద్ద నున్నప్రతి యసంపూర్ణ మని అచ్చువేయ వెనుదీయుచున్నా రనియు, ప్రతి పురాతన మైనందువలననో, మఱి యేకారణము వలననో కాగితములు ఛాల

జీర్ణించి, అంటగానే, విరుగుచుండుటవలన దానిని వెలికిఁదీయుటకు, నితరుల కిచ్చుటకుఁ బంతులుగారు సందేహించి వెనుదీయు చున్నా రనియుఁ దెలియవచ్చినది. శ్రీవావిళ్ల వంశము వారు సంస్కృతాంధ్రభాషలకే గాక, ఆయుర్వేద వ్యాపకమునకుఁ జేసినసేవ నిరుపమానము. ప్రతి, చాలజీర్ణస్థితిలోనుండిన ఉన్నంతమట్టుకు, గ్రంథమును బ్రచురించిపండితులకు, పరిశోధకులకు నందించిన, కొఱఁతభాగము వెదకుట, సంపాదించుట సులభతరము గాదా? ఆలస్యము చేసిన. కొఱఁతభాగము దొరకునని రూఢిగ చెప్పఁగలమా? ఎన్నిసంవత్సరము లెదురు చూడుమందురు? ఆలస్యము చేయుకొలఁది, ఉన్నదియు జీర్ణము కాఁగలదు. ఇప్పటికే యెన్ని యేండ్లు గడచినవి, ఎన్ని రామబాణములు పుటల ప్రమింగుచున్నవో!

6. వావిళ్ల వారు సంకల్పించిన "పరహితము" క్యాటలాగులో నిలిచిపోవుటచేతను, వారియొద్దనుండు ప్రతి మూలవిగ్రహమువలె, మాబోంట్లకుఁ దాఁకుభాగ్యము లేకపోవుటవలనను, తిరిగి,తిరిగి,విసిగి,తుదకు ఓరియంటల్ లైబ్రరీకి మరల నాదృష్టిని త్రిప్పితిని. ఆంధ్రాయూనివర్సిటీలోని తెలుఁగుపండితు లగు బ్రహ్మశ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిలవారి సలహాపై ఆంధ్రవిశ్వవిద్యాలయగ్రంథాలయాధికారుల సాహాయ్య మపేక్షించితిని. తద్గ్రంథాలయాధిపతి మద్రాసు ఓరియంటల్ లైబ్రరీవారిని "పరహితసంహిత"ను విశాఖపట్టణమునకు కొద్దిరోజులు పరిశోధనార్థము పంపు మని కోరిరి. మద్రాసువారు (అత్తగారుకాన) తెలుఁగువారిదైన సిహొత్తము నంతసులభముగాఁ బంప మనిరి. అరుదైన ప్రతికాన, దానిని తననెలవు నుండి, తప్పింపరా దనిరి. (అరుదు కాని గ్రంథములను, ప్రతులను విశ్వవిద్యాలయగ్రంథాలయములు, పరిశోధకులు కోరుదురా?) తుదకు, మూలమునకు, ఒకప్రతిని వ్రాయుంపఁ దగిన యేర్పాట్లు కోరితిని. అందులకు కిమ్మత్తు రూ. 45 ముందుగా దాఖలు చేసిన ప్రతిని వ్రాయుంచు నేర్పాట్లుచేయుదు మనిరి. ఇంతలో, నందినాగరి తెలిసినలేఖరి సెలవుపెట్టెను.

ఇట్టి, పరిస్థితులలో, నాకు ఆరోగ్యముచెడి వసతులు, వ్యవధి లేనందున, మిత్రులగు శ్రీ బెజవాడ రామచంద్రారెడ్డిగారు విశాఖపట్ట ణము రాఁగా, వారిని సందర్శించి, వారి కీ ప్రాచీనగ్రంథముయొక్క యునికిని దెల్పితిని. వారు, వావిళ్ల వారిగ్రంథము(ప్రతి)దొరక దని తెలి సినతర్వాత, ఓరియంటల్ లైబ్రరీవారికి వారును వ్రాసిరి. పని కొనసాఁ గునట్లు సూచనలు లేకుండెను. రామచంద్రారెడ్డిగారు ఆంధ్రభాషాభి మానులే కాక, ఆయుర్వేదపక్షపాతులు. ఎన్ని యాటంకములువచ్చినను, విడువక మఱిమఱి విచారించి, ప్రయత్నించి, తుద కొకపండితునిచే మూలమునకుఁ బ్రతిని వ్రాయించి, నా కందఁజేసిరి. వారి పరిశ్రమ ప్రశంసార్హము. నేను వారి కెంతయుఁ గృతజ్ఞుఁడను.

7. ఎందుల కాయాతురత, ప్రయాసము నందు రేమో! శాస్త్రిల వారు మొదట నీగ్రంథప్రస్తావనను జేసినప్పటినుండి, నాకుఁ గొన్ని భావ ములు, సందేహములు తట్టుచుండెను. పలుసంవత్సరములనుండి ఆంధ్ర దేశపువైద్యగ్రంథముల నన్వేషించుచు, వీలైనఁ జదువుచు, విమర్శక దృష్టితోఁ జారిత్రకపరిశోధనకు సాధనము లరయుచుండువాఁడ నైనందున, పై గ్రంథపరిశీలన మనేకవిషయములను దెల్పు నను నాసయుండెను. అది బహుశః సుప్రసిద్ధపరహితవంశీయులు, వంశపారంపర్యముగ స్వకుటుంబ మునఁ బెఱుగుచువచ్చిన విజ్ఞానసర్వస్వమును, పలురకముల అనుభవము లను వ్రాయుచు, వ్రాయించుచు, తమపుత్రపౌత్రుల యుపయోగార్థము, శిష్యుల బోధనార్థము, శాశ్వతముగ గ్రంథరూపమునఁ గ్రోడీకరించి యుండుటవలన గ్రంథమునకుఁ బరహితసంహిత యని పేరు కల్గె నని యెంచుచుంటిని. ఇందలి విషయములను, విభాగములను, ఏర్పాటును, వచనమును బరిశీలించిన నిది యింకొక ప్రాచీనగ్రంథముయొక్క ప్రతియో లేదా బహుగ్రంథములనుండి సంగ్రహింపఁబడినదియో, ఉపజ్ఞతగలవా రెవరైన రచించిన స్వతంత్రగ్రంథమో, లేదా అనుభవమే ముఖ్యముగా నెంచిన భిషజ్మణుల యమూల్యరహస్యములు, యోగములు వ్రాసి యుం

చినగ్రంథమో తెలియుటయే గాక, సమకాలికపరిభాష, విజ్ఞానము, చికిత్సాక్రమములు,రోగములు, పథ్యములు దెలియవచ్చునని నాయాస.

రెడ్డిగారు నాచేతి కిచ్చినప్రతిని రాత్రింబవలు పరిశీలించితిని. ఒక రాత్రిగడవులో నాప్రతిని, మిత్రులును, ఆంధ్రులచరిత్రయందు నిరంతరము పరిశోధనలు సల్పుచుండువారును, రెడ్లచరిత్రను సంపూర్ణముగ, సమగ్రముగ వ్రాయుచుండువారును నగు మల్లంపల్లి సోమశేఖరశర్మగారికినిచ్చి, మఱునాఁడిద్దఱముఁనుగలిసి, గ్రంథవిషయములఁజర్చించితిమి.

ఆ కొలఁదికాలములో "విషయసూచిక"ను దయారుచేయుట యసాధ్య మయ్యెను. ఆ ప్రతియందుఁ గొన్ని చిన్న చిన్న వ్రాఁతతప్పులున్నవని దానిని వ్రాసి యిచ్చినపండితులే సంకోచపడుటవలన ఆప్రతిని మరల శ్రీరామచంద్రారెడ్డిగారి కిచ్చి, నిర్దోషముగ నేర్పడినతర్వాత దానిని బూర్తిగ విమర్శింప నెంచితిని. ఆతప్పులుదిద్దఁబడుచున్నవి. పైఁగా ఆసంస్కృతగ్రంథమును తెనుఁగులిపిలో వ్రాయించుటయే గాక, తెనుఁగుమాటలలోనికి భాషాంతరీకరణము చేయింపవలె ననుకోర్కె కలిగెను. అందులకును రామచంద్రారెడ్డిగా రామోదించి పూనుకొనిరి. ఆంధ్రగీర్వాణభాషాపండితులే గాక, ఆయుర్వేదవిశారదు లగు నొకమిత్రుని నిందుకై రెడ్డిగారు ప్రోత్సహించు చున్నారు. అవసర మైనసవరణలు, గ్రంథవిషయమును దెలిఁగించుటయు, పూర్తి యైనంతనే, చరిత్రకు ఆయుర్వేదమునకు, ఉపయోగకారి యగు నీప్రాచీనగ్రంథమును నాంధ్రలోకమునకు నందఁజేయుసంకల్పముతోఁ గృషిచేయు చున్నాను.

8. పై ప్రతియందును, మొదటఁగొంతభాగము జీర్ణమైనది. మధ్యనచ్చటచ్చట, కొన్ని వాక్యములు, మాటలు, అక్షరములు సరిగలేవు. అయినను, ఉన్నంతమట్టుకు దీనిని వావిళ్లవారిప్రతితో సరిచూచి సవరించుట యవసర మని నామనవి. వావిళ్ళవారిప్రతి యెప్పుడు వ్రాయఁబడినది యేమూలమునుండి వ్రాయఁబడిన దనువిషయము వారే తెల్పవల

యును. అది తెలియకున్న ? ఇతరులు నిర్ణయింపవలయునుగదా ! ఇట్లు పరిచూడనియెడల ప్రకటించువారు వైద్యవాఙ్మయమునకు లోపము చేసినవా రని పండితులు పల్కరా ? తంజావూరులోఁ గాని హైదరాబాదులోఁగాని యితరపండితవంశముల గృహములలోను పరహితమునకు సంబంధించిన ప్రతు లేమైన గలవా ? పండితులు, పరిశోధకులు తాళపత్రగ్రంథాన్వేషకులు జాగరూకులై యుండిన ప్రతులజాడదొరకునేమో ! ఒకప్రతియైన నచ్చుపడి, విద్యావినోదులచిత్తము నాకర్షించిన యెడల, వారిప్రయత్నమువలన నితరపండితుల సాయమున, మూలపాఠ వేయఁబడి యుండునితరప్రతులనుగాని, లేదా, యితరప్రాచీనాయుర్వేదీయగ్రంథసంచయసహాయమునఁగాని జీర్ణభాగములను మాటలను, అక్షరములను బూర్ణముచేయుటకుఁ గొన్ని యానుకూల్యము లేర్పడును. ప్రస్తుత మొకటిమాత్ర మాలోచింపవచ్చును. గ్రంథము "పరహితము" అని పిలువఁబడుటకు ముఖ్యకారణము గ్రంథము రచించినవారిగౌరవ బిరుదమా లేక వారు చేయుచుండిన లోకోపకారచికిత్సలు ప్రాణరక్షణయునా ? పరహితము అనఁగా వైద్య మనియా ?

9. ఇట్లు ఆందోళనపడుచు, వేఱువేఱుచోట్ల నుండు తాళపత్రగ్రంథములపట్టీలను, తద్గ్రంథములను వెదకుచు తిరుగుయాత్రలలో, కాకినాడలో నాంధ్రసాహిత్యపరిషత్ గ్రంథాలయమున తాళపత్రగ్రంథములలో నొకపేరు కని నాదేహము పులకాంకితమయ్యెను. ఆ పేరు "పరహితక్రమము". పరహితమును రాత్రింబవలు స్మరించుట అలవాటయిన నేను ఈపేరు విని పెన్నిధి దొరకినట్లు సంతసించితిని. ఈపేరు పరహితసంహితకు మఱియొక నామము కాఁబోలు నని మొదట తలంచితిని. నేనున్ను, పరిషత్పండితు లగు బ్రహ్మశ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రులుగారును, ఆతాటియాకులకట్టను వెదకి తీసి దుమ్ము రాల్చి త్రిప్పి త్రిప్పి పరీక్షించితిమి. ఈగ్రంథము (దొరకినకట్ట) మద్రాసులైబ్రరీలో నుండుదానికంటె చాల చిన్నది. అంతేగాక యిందలి యుపోద్ఘాతము విషయవిభజన భాష, "పర

హితసంహిత "కుఁ జాలభిన్నముగనుండెను. "పరహితసంహిత"కుఁ జాల కాలము వెనుక పాండిత్యము తగ్గినరోజులలో నావంశమువారు వ్రాసియుంచినదో, యేమో యనియాస, భ్రమకలిగెను. ఇది నిజముగా స్వతంత్రరచన కాదు. భాషాంతరీకరణమును గాదు. ఎవరో సంస్కృతము కొంతవఱకుఁ జదువుకొన్న పండితులు సంస్కృతగ్రంథములనుండి, తెనుఁగు గ్రంథములనుండి, వైద్యులయొద్దనుండి, వ్రాసికొనిన ముఖ్యభాగములు, యోగములు, సూత్రములు మొదలైనవి. అనఁగా ఒకనోటుబుక్కు. గ్రంథమం దెచ్చటను పరహిత మనుమాట లేదు. ఏభాగము వ్రాయునపుడాభాగము రచించినవారిపేరు కలదు. ఆనామము స్మరింప నవసరమేమి? పరహితసంహితయందలి గద్యమిచ్చటఁ గానరాదు. ఆ పాండిత్యము, ఆ విభజన, ఆ ధోరణియు నిందు వెదకినను దొరకవు. అట్లయిన పరిషత్తువారి పుస్తకములపట్టీలో దీనికి "పరహితము" అని పేరు కలదు. ఈ పేరు ఎవరు పెట్టిరి ? పుస్తకమును వ్రాసికొన్నవారా ? ఇచ్చినవారా ? పట్టీ తయారుచేసినవారా ? తాళపత్రములులిఖించినవారే పైపేరిచ్చినట్లు చెప్పవచ్చును. అందులకుఁ గారణము చర్చనీయము. మధ్యయుగమునను తర్వాతను తెనుఁగుదేశమున పండితవైద్యవంశములలో 'పరహిత మనఁగా వైద్య మనియు, పామరులు సాంప్రదాయవైద్యులు (నగరాలు) మొదలగువారు తమయిండ్లలో "చిటికాలు" "గృహవైద్యము" "అనుభూతప్రక్రియలు" "వైద్యగ్రంథము" "వైద్యశాస్త్రము" అని పలువిషయముల బహుగ్రంథములనుండి యెత్తి వ్రాసికొన్నపుస్తకములనుభద్రపఱుచుచుండునట్లు, ఏపండితవంశమునఁ బుట్టినవారో తమకొఱకో తమసంతతికొఱకో వృత్తికొఱకో, వినోదముకొఱకో గాని, లాభముకొఱకోగాని లోకోపకారమునకుఁగాని, వ్రాసియుంచిన వైద్యవిజ్ఞానఖండముల సంపుటమునకు "పరహితక్రమ"మని వాడుకప్రకారము, పే రిడినాఁడనియు నాయూహ.

లయిరి. అయినను సాంఘికరంగములోవలె భాషా సాహిత్యవిషయముల లోను పంతులుగారు విరోధమువల్ల జంకక, ధీరులై పోరి, తాము నమ్మిన రీతిని సంస్కరణను సాగించిరి. ఆనవ్యభావము లాయన యితరవిద్వాంసులకును వెల్లడిచేసెను. పూర్వకవుల సాలంకారరమ్యకవిత్వపు సంప్రదాయమును కఠినచిత్రకవిత్వముద్వారా తరువాతి కవులు చెఱచి యాంధ్రభాషా యోషకు శృంఖలము లేర్పఱచి బాధించుచున్నా రని 'సరస్వతీ నారద విలాపము' అను చిన్న రచనలో (సరస్వతి తనకొడుకగు నారదునితో మొఱఁబెట్టినట్లు) చమత్కారముతో వర్ణించిరి.*

*మ. రమణీయోక్తులచేత సద్గుణ సారస్యంబు గల్పించుచున్
దమి నాయంగచయంబునన్ సహజ సౌందర్యంబు పెంపొందఁ గ్రొ
చ్చమలంకారములుంచి తొల్లిటికవుల్ చేష్టా చమత్కారభా
గ్యము హెచ్చించుచు దీర్ఘకాలము ననుం గాపాడి రగ్రక్రియన్॥

చ. అటు సుఖియింపుచుండఁగ మదాస్యమునందు నిరర్థశబ్దముల్
పటుపటలాడు శబ్దముల బల్మిని బెట్టి, రసంబు నెట్టి, యి
క్కటికములే కలంకరణ కైతవముంగొని మేనుకట్టి యి
ప్పటిఘను లార్తిపెట్టెదరు ప్రాణముతీసి ననుం గలంచుచున్.

క. తెలియదు సుమ్మిప్పుడు. నాపలుకుల యర్థంబు నాకె భావము లేమిన్;
వెలభూషలుగా కివి సంకెలలయి కడు నాదుమేనికిన్ వెత నించున్.

క. సుందరబహురసపుష్టి నమందానందంబు బుధులమది కిడఁ జేనిన్,
ఛందోబద్ధంబగు పదబృందాటోపంబు తాఁ గవిత్వం బగునే ?

క. రసములె కావే ప్రాణము లసమానకవిత్వకాంత కవనీస్థలిలో?
రసహీనమైన కవితకుఁ బొసఁగించు నలంకృతి శవమున కిడు తొడవే.

సీ. దయమాలి తుదముట్టఁ దలకట్లు నిగడించి ధీరుఁడై నన్ను బాధించు నొకఁడు.
పాదంబులోపల పాదంబు లిమిడించి వీరుఁడై నన్ను నొప్పించు నొకఁడు.
ప్రాసంబుపైఁ బెక్కుప్రాసంబు లడరించి పోటుబంటై నన్నుఁ బొడుచునొకఁడు.
బెండుపల్కులు గూర్చి నిండించి నగలంచు దిట్టయై చెవులు వేధించు నొకఁడు.
ఖడ్గచక్రాదిరూపముల్ గానిపించి,వర్ణములుమార్చి ననుఁ జిక్కుపఱచునొకఁడు.
కుమతులాడఁ జెల్లవిఱిచి ప్రాణములుతీయ,నోడలిపసలేక శుష్కించియున్నదాన.

ఇప్పటి సాంఘికపరిణామమును గమనింపక ప్రబంధకావ్యముల నొకేరీతి కథలతో కవులు పూర్వసంప్రదాయములో రచించుటను దప్పింపఁ దలఁచి, దానియం దవజ్ఞ గల్గుటకై ఆయన 'అభాగ్యోపాఖ్యానము'ను రచించెను. వానియందే ప్రేమగల్గి యది సాహిత్యామృతముగ నిత్యముఁ గ్రోలువారికిని 'పిండఖర్జూరోద్వేజితులకుఁ దింత్రిణీఫలము'వలె నీయుపాఖ్యానము రుచికరమే యగును †

---

† ఈవికృతకవిత్వములో కొన్నికఠిన శైలివికలవు,

ఉ. ఆపురమేలు రాక్షసమహాకులవారిధి బాడబుండు, కాకిపురనాథ విష్ణు సరసీరుహాసంభవ పాదభక్త సం
తాపకరుండు, పుణ్యవసుధాధర వజ్రిధరుండు, పొల్లస
త్పాపథసంచయానిలుఁడు దానవుఁ డొక్కఁ డభాగ్యనాముఁడై.
(నాయకుఁడు.)

చ. కనియెన్ దానవదూత నూత్మనయనన్ కాంతాకారని
రసజీవన్, ఖరవాణిఁ గీశసమవక్త్రన్ రక్తకర్ణాలకన్,
గనదుద్య ద్వసుధాధరాంచితవలగ్నన్ భూరినీలాధరన్,
ఘనదేహన్ లసదుష్ట్రియాన విలసత్కాంతా కదంబాధమన్. (నాయిక.)

కాని, ఈ 'పొగడీ'(=హేళనకావ్యము)లోను జనులజాతీయము నుపయోగించు సులభపద్యములు హెచ్చుగ నున్నవి.

ఉ॥ (పురవర్ణన) కొంపలమీఁది తుక్కుఁగొట్టుకు పోవఁ
గ...ముక్కున వెంట్రుకలెల్లమాడఁగన్.
(రాజగుణములు)

చ. అతనికిఁ బొట్టకోసినను నక్షరమొక్కటిలేదు; కాఁగడ
న్వెతకినఁ దెల్విలేదు; దయ వీసమునుం గలదైనలేదు; పొ
స్నతనయవిద్యలేదు పదునాల్గు పుటంబులువెట్టి కాల్చినన్;
చతురత వాఁతపెట్టినను సత్యము జిహ్వకు రాదొకప్పుడున్"
(నాయికస్వభావము)

కొమ్మగా దది మేటిపెద్దమ్మ గాని, బాలగా దది యముచేతికోలగాని
కన్నెగా దది బలిసిన దున్న గాని, నారికా దది జనులకు మారిగాని.

తుద కభాగ్యునినాయికతరపువారు మర్దించి యొకగోఁతఁ బారవేయఁగా భటులా రాజు నొకచాపలోఁ జుట్టి పందిరిగడల రెంటిని గట్టి యందుపైన,

మొదటి యచ్చ తెలుఁగురచనలలోను గొన్ని పద్యములు (వీరరస సందర్భములోనివియు) ద్రాక్షాపాకములో సుబోధముగనున్నవి*ఆయన యనువాదనాటకములలోని శైలియు రమ్యముగనున్నది. కాని సంస్కృతానువాదములకున్న ప్రసిద్ధి యాంగ్లమునుండి యనువదించిన నాటకములకు లేదు. వానికథ వినోదకరమైనను, అవి పాశ్చాత్యసంఘపు సంప్రదాయముల వివరించు వచనరచనలు.

వెనీసువర్తకచరిత్ర మాత్రమంతయు ద్విపద. దానిలోను మరి కొన్నిటిలోనుగల ఆయన ద్విపదశైలి రంగనాథరామాయణాదుల శైలి వలె హృద్యము నీతిబోధకమునై, గేయముల రీతి నున్నది.†

---

'శయనింపఁజేసి యిద్దఱు దయతోడ న్మొపుపైని దద్వాహనమున్
గయికొని పరమపదంబునకయిజేర్చు మహానుభావు కరణిన్ నృపునిన్'

వహించి, పురవీథుల నూరేఁగించి రఁట. ఈవైభవముతోఁ

'శ్వాననినదంబు మాగధస్తవముగాఁగ విధవల భయస్వరములు దీవనలుగాఁగ
ఘూకఘూంకారములువాద్యఘోషములుగ నగరుచొత్తెంచె. నా ఱేఁడునడిమిరేయి'

తుదకు నాయకుఁడు

'వరుసగ మొలయును దలయునుఁ శిరమును గడములును వానిచెప్పంగఁగఁ,
శ్వరు లెవ్వారును నొల్లని, మరుదశమావస్థ నతఁడు మానక చెందెన్'.

ఇట్లు నాయకునిదుర్మరణముతోఁ గథ ముగిసినది.

* చుట్టుముట్టినట్టి దిట్టలనందఱ, నిలచి పారఁద్రోలి గెలుపుగాంచి
త్రోవఁగానసాళ్ళుదూలించి పరలించి, వెలదుకలను గొంచు భీష్ముఁ డరిగెఁ
జన్న మొనర్చి వెన్ననరుఁ జక్కఁగఁ దమ్ములమీఁయఁ బోవఁగా
గన్నుల నిప్పులొల్కఁగని కాలులు ద్రేలుచు నెల్లవారలుం
బన్నమునొందఁ గృష్ణు శిశుపాలుఁడు తిట్టిన, నల్గియప్డె
వెన్నుఁడు చుట్టుకైదువున ద్రేల్మిడి ద్రుంచెను వానిమత్తుకన్.
(శుద్ధాంధ్రభారతసంగ్రహం.)

నేలఁ బడియున్న భీష్మునిపాలికేఁగి
యంపసెజ్జయు దలగడ యతనిఁ కపుడు
క్రీడినేర్పుమైఁ గలిగించివాఁడి తూఁపు
నేలలోనాఁటి దగమాస్న నీరుఁడ్నసి

†తనచేయు నుపదేశములఁబట్టి నడుచు కొనువాఁడు దేవుఁడేయని చెప్పవచ్చు...

నాటకముల నాంధ్రీకరించుటలో వీరేశలింగముగారు వీలైనంత వఱకు మూలములోని భావములనే గాక వాక్యములను పదములను గూడ విడువక పూర్తిగ్గా నైన తర్జుమా చేసిరి. అట్లు చేయుటవలన నెక్కువ శ్రమగల్గుట సహజము. ముఖ్యముగ కవికులతిలకుఁడగు కాళిదాసు గ్రంథములందలి భావసంపదను ధ్వనిని దెలుఁగులోనికి రప్పించుట చాలఁ గష్టము. కాళిదాసు కుమారసంభవములోని గంభీరభావములను అర్థవిశేషములను దన హరవిలాసములోఁ గొన్నిచోట్ల శ్రీనాథుఁడును దేలేకపోయెను. కనుక శాకుంతలము నెంత జాగ్రత్తతోఁ దర్జుమా జేసినను, అది చదువుటకు బాగున్నను, వీరేశలింగముగారును గొన్నిచోట్ల మూలమందలి గభీరమధురభావములను బూర్తిగఁ దేలేదని తోఁచును*

సమబుద్ధిఁజూడ నీక్ష్మామండలంబు, రమణీయనాటకరంగంబు నమ్మ
ఎల్లవారును దమకేర్పడ్డ కిథనుఁ, జెల్లను వినిపింపఁ జెడని వేషమున
మహిని మెఱసెడి దెల్ల హేమంబు గాదు, పలుమఱు మను జెప్ప నిదివిన్నవాఁడ
పలువు రమ్మెరి తమదు జీవములు నాదు మీఁది రూపంబు గనుటకే, మిథ్యగాదు
పుత్తడి సమాధులకులోనఁ బురుగులుండు.

(వెనీసువర్తకచరిత్ర.)

*'అప్రమాణంబెయగు జన్మమాదిగాగ సతముఁగౌటిల్యమెఱుఁగని జనముమాట
అన్యశంచనమే విద్యయట్లు నేర్చువారెపో సత్యవాదులు వసుధమీఁద' దీనిలో
ఆజన్మనశ్శాఠ్యమశిక్షితో య స్తస్యాప్రమాణం వచనం జనస్య
'పరాతిసంధాన మధీయతేయై ర్విద్యేతి తే సంతు కిలాప్తవాచః'
ఇందలి కాకుధ్వని తెలుఁగులో స్పష్టమగుటలేదు.
'అమరతరు ప్రశస్తవనమం దసుధారణవృత్తి గాలిచే
సుమహిత కాంచనాంబుజరజోవిల సజ్జల మందు స్నానమున్
దమిని మణి ప్రదేశముల ధ్యానము నచ్చరలొద్ద సంయమం
బమరతపఃఫలం బితరులందు నెడన్ దపమొప్పు వీరికిన్'
ప్రాణానా మనిలే నవృత్తి రుచితా సత్కల్పవృక్షేవనే
తోయే కాంచనపద్మరేణుకపిశే ధర్మాభిషేకక్రియా।
ధ్యానం రత్నశిలాతలేషు విబుధస్త్రీ సన్నిధౌ సంయమః
యత్కాంక్షంతి తపోభిరన్యమునయ స్తస్మిం స్తపస్యంత్యమీ.
ఇందలిభావమృదుత్వములు పైతెలుఁగుపద్యములో సరిగా రాలేదు.

కాని మొత్తముమీఁద కవిహృదయమును గనిపెట్టి యతిప్రాస నియమముల విడువకయే చాలవఱకు రసమును బాగుగఁ బోషించినారు†రత్నావళ్యాదులలోను అనువాదశైలి సరళముగ నున్నది *

†ఉ॥ శాకుంతములోని చతుర్థాంకపు లోకప్రసిద్ధమగు 'శ్లోకచతుష్టయము' (1 యాస్యత్యద్య...2 పాతుంనప్రథమం...3 అస్మాన్సాధు...4 శుశ్రూషస్వ...)కు వరుసగ వీరేశలింగముగారి యనువాదము చూడుఁడు.

కొందలమందె డెందము శకుంతల తానిపుడేఁగునం చయో!
క్రందుగ బాష్పరోధమునఁ గంఠముఁ జెడె దృష్టిమాంద్యముం
బొందె నొకింత పెంచిన తపోధనులే యిటుకుంద, నెంతగాఁ
గుందుదురో తమంత గనుఁ గూతులఁ బాయఁ గృహస్థు లక్కటా!
ఎవతె జలంబు మీ కిడక యెన్నఁడు ద్రాగదు తాను ముందుగా
నెవరితె ప్రేమచేఁ జిదుమ దీప్సితభూషణ యయ్యు మీ చిగు
ళ్లవతెకు మీరు తొల్త ననలెత్తుట పండువుగాఁగ నుండు నా
ప్రవిమలగాత్రి యేఁగు పతిపజ్జకు నంద ననుజ్ఞ యీయరే!
మమ్ముల సత్తపోధనుల, మాన్యభవత్కులమున్, స్వబంధులన్
సమ్మతి వేఁడ కీమె యెటొ సల్పిననీపయికూర్మి నెంచి యీ
కొమ్మను నేలుకొమ్ము సరికొమ్మలతో సమగౌరవంబునన్;
బిమ్మటిదెల్ల భాగ్య మగు; బేర్కొనరా దది యింతిబంధువుల్.
గురువులసేవఁ జేయు మనుఁగుంగతిఁ జూడుము నీసపత్నులన్
వరుఁ డలుకన్ వహించినను భర్త్రువిరుద్ధవుగాకు మీసునన్,
పరిజనులందుఁ జూపుము కృపం గడుఁ బొందకు భాగ్యగర్వమున్,
తిరిగిన నిట్లు కాంతురు సతీత్వముకాంతలు నింద్యలొందుచోన్.
భరతవాక్యమిట్లు తెలిగింపఁబడినది.
ప్రజలహితార్థమే నృపుఁడు వర్తిలుఁగావుత మెల్లయప్పుడున్!
సుజనులవిద్య పూజ్య యయి శోభవహించును గాక యెల్లెడన్॥
నిజకృప నీలలోహితుఁడు నిత్యుఁడు శక్తిధరుండునైన యీ
గజదను బారిఁ బోనడచుఁ గావుత నాకును మాఱుజన్మమున్॥

* సూర్యాస్తమయవర్ణనము (రత్నావళి 3 వ అంకము.)
చక్రమొకండు గల్గు రథసంగతి నెట్లు జగంబునెల్ల ని
ర్వక్రతఁ జుట్టి రేపకడఁ గ్రమ్మఱ రాఁగలనంచు నష్టు ది

కొన్ని స్వతంత్రగీతములను గూడ ఆయనరచించిరి. ఆయనస్వతంత్ర నాటకములన్నియు మంచిపేరుఁగాంచినవి. అందలిపద్యములు సరసములు రమ్యములు నే గాక, చక్కని నీతిబోధించునవి. ముఖ్యముగ ప్రహ్లాద నాటకము భక్తిరస మొలుకుచుండును *హరిశ్చంద్రనాటకపుధోరణియు నిట్టిదే † ప్రకృతి వర్ణనయు సుందరము †† (నవలయగు రాజశేఖరచరిత్రలో సుందరప్రకృతి దృశ్యముల చక్కని వర్ణనలున్నవి.)

---

క్ప్రక్రమునందు గూర్చెడునొ సంధ్యనునిల్చిన యంశుజాలమన్
వక్రతలేనియాకులన భానుఁడు బొల్చెడు బశ్చిమాద్రిపై న్॥
(ఈశ్వర వర్ణన: ప్రబోధచంద్రోదయము. 6 వ అంకము.)

ఎవ్వనిలో జగంబు జనియించి రమించి లయించు నీజగం,
బెవ్వని కాంతిచే వెలుఁగు, నెవ్వని తేజము సత్స్వరోజ్వలం,
బెవ్వనిఁగొల్చి ద్వైతతమ మేఁగఁ బునర్భవ మొంద రెప్పుడున్
నెవ్వఁడిఁ బుణ్యు, లాపురుషు నిత్యుని శాంతు స్తుతింతు నక్రియున్
శాంతము నిర్మలంబును నజంబు ననంతము నిష్కలంబు నా
సంతత తేజ మీభువన సంభవ మెందు వికారమొందునే ?
కాంతిని నల్ల గల్వల నగంగల మబ్బులచాలుపుట్టుచో
నింతయు నాకసంబు వహియించునె తాను వికారలేశమున్

* ఎచటనున్నాఁడు శ్రీవిష్ణుఁడిప్పు డంచు అసురనాయక నన్ను నీవడుగనేల
అఖిలవిశ్వాంతర్యామియైన యతఁడు లేని చో టేది గలదయ్య పూనివెదక.

† పాతఁదియన్న కారణముబట్టియె సర్వము మేల్మి జెందునే
నూతనమన్న హేతువున న్యూనతఁ జెందునె కొత్త వన్నియున్
ఖ్యాతిగ నుత్తముల్ గుణములారసి మంచి గ్రహింతు రెప్పుడున్
బ్రాఁతవె మంచివందు రవిమర్శత నేవలమూఢమానవుల్
భీరుఁడు చావుచా వనుచు వేమరు దా మరణార్తి నొందెడున్
ధీరుఁడొ యొక్కసారియె మృతింగనునప్పుడు బాధనొందెడున్
ధారుణి దేహధారులకుఁ దప్పక చావెప్పుడైన నుండగా
నూరక చావుకై వగపునొందఁగ నేటికి మాటిమాటికిన్.

†† అల్ల తరంగడోలికల హంసములూఁగెడు మెల్ల మెల్లఁగా
దెల్లనినీరు కూలనిహతిన్ ఫెనముత్యము లట్లు లేచెడున్
జల్లనిగాలి వీచెడును సౌరభముల్ వెదఁజల్లు చల్లన
సల్లలితప్రశస్తి నదె జాహ్నవి పొల్చెడు నేత్రపర్వమై.

పై మాటలను, ఉదాహరణలనుబట్టి, వీరేశలింగముగారి కావ్యములలో సందర్భోచితముగ వేర్వేరురసము లన్నియు గలవని విశదము; ముఖ్యముగ రత్నావళి శాకుంతల రసికజనమనోరంజనాదులలో సంభోగశృంగారము, శుద్ధాంధ్ర నైషధములో విప్రలంభము, భారతదక్షిణ గోగ్రహణాదులలో వీర రౌద్రభయానకాదులును హరిశ్చంద్రోత్తర రామాయణములలో కరుణరసము, ప్రహ్లాదాదులలో శాంతరసమును చక్కగ పోషింపఁబడినవి. కేవలహాస్యరసోద్దేశముతో రచింపకపోయినను సంఘదోషములఁ బోఁగొట్టుట కాయన వ్రాసినరచనలలోను,'అభాగ్యోపాఖ్యానాదులలోను, ఘాటగు హేళన హాస్యము చాలఁగలదు.

ఆయన ప్రహసనములఁ జదువునప్పుడు నవ్వు రాకతప్పదు. ఇందును దురాచారముల నపహసించుటే ముఖ్యోద్దేశము; ఇందొకొక్కచోట మృదుహాస్యమును కలదు. (ఉ. బలాత్కార గానవినోద ప్రహసనములో విస్సప్పపాత్రుని చర్యలు మాటలునేగాక, తుదకతఁడు పాడిన యువకతవకభావపు పాటయు చాలహాస్యజనకము. ఇది మృచ్ఛకటికలోని శకారుని ప్రలాపమును జ్ఞప్తికిఁ దెచ్చును.*)

ఈయన శుష్కవాది గనుక తీవ్రవాదములో శత్రువులదూషణవాక్యములసహింపక తామునట్లే జవాబిచ్చుచుండిరి. ఉ॥కొందఱుపూర్వాచారపరులు తాము దురాచారములఁ జేయుచున్నను సంస్కర్తలను దూషింపగ, వారిని తీవ్రముగ పరిహసించుచు, ఆయన పూర్వనాగరిక

---

* అగ్గితిరువాళ్ళంట-అర్జుని కత లంట-ఓరా
యెంతసోద్యమే బారతకత-ఓరా యన్ని యింతలే.

సుగ్రీవజయము దీనిసుట్టూబలాదూరు-అగ్గురోష్పు అయ్యో ర్నదుగే నీసాచ్చిగ
ఇగినేశుపైనెక్కి-యిదీసనూడొచ్చి బగుపెగ్గలెన్నొన్నో-పలికి దుశాసుని
మొంగముసూడగానే-మోర్చపోయినట్టె, గుగురుమిగురసరుండ గుడ్లెలగుక్కనే;
ఇరన్నేశుసద్దను డిందప్రజిత్తొకరెయ్యి-దురియోదనుని చెవిలో దూరిముక్కునసెల్లె;
అరసి పిసాసాలె అశ్వద్దామనుమింగె-సురియోద మాయెనే సూడ యేడుకాయె.

పంచరత్నములనుపేర సీసములు సృజించిరి. ఇది కేవలం మోటహాస్య మని కొందఱికి తోచును; కాని కొంతవఱకు యథార్థము నాయన వివరించిరి* మనలో పరులనాక్షేపించువారు తమ సదాచారమును మనశ్శుద్ధితోఁ గాపాడుటతక్కువ; మఱియు 'శ్రోత్రియబ్రాహ్మణు'లలోను చుట్టలుగాల్చుటయున్నగు దురభ్యాసములు పెరుగుచున్నమాట వాస్తవము. వైదికమతము పేర నిజమగు శ్రుత్యుక్తమగు నుదారమతప్రవృత్తికి బదులు మధ్యకాలమందువచ్చిన పౌరాణికమగు మూర్తిపూజా బాల్య వివాహాదులనే శిష్టాచారు లాచరించుటయు, సంఘక్షేమమునకు నిజమైన ధార్మికతకు బదులు హానికరమైనను సంప్రదాయమును నిలబెట్టుటే ఆస్తికలక్షణముగ 'సనాతను'లు భావించుటయు. విచారకరము. అట్టివాయనకు భేదమును కోపోద్రేకమును గ్రహించుచుండెను. ఈయన ననుసరించియు తీవ్రదృష్టి లేకుండిన చిలకమర్తి లక్ష్మీనరసింహము, పా॥ లక్ష్మీనరసింహారావుగారలు తమరచనల నింపుగను మృదుహాస్యభరితముగను జేసి జనరంజకులని పేరుఁగాంచినారు.

తరవాణిముందుగాఁ ద్రాగి శ్రాద్ధముపెట్టి నిష్ఠాపరుల మంచు నిక్కువారు
సంధ్యవార్చక చలిసాపాటుఁ గావించి కర్మిష్ఠుల మటంచు గవియువారు
కల్లుసంద్రములాది పేళ్లనొల్లించి శాస్త్రవేత్తలమంచుఁ జాటువారు
కల్లుకంపడఁగంగఁ బెల్లుచుట్టలు త్రాగి సాహితాగ్నుల మంచు నడచువారు
న్యాయసభలందుఁ దప్పుసాక్ష్యంబులిచ్చి శిష్టజనవరిష్ఠుల మంచుఁ జెలఁగువారు
వీరు పూర్వనాగరికులో పెద్ద లిపుడు దుష్కులాచారరక్షణోద్యోగు లకట.
బాలరండల కాళపడి చెడి విధవలంపెండ్లిండ్లవల దంచుఁ బేలువారు,
రాళ్లఁగొల్చుచుఁ దూలిబ్రహ్మంబు సేవించువారె భ్రష్టు లటంచు వదరువారు,
కన్నకూఁతుల నమ్మగాఁగోరి బాల్యవివాహము లెస్స లంచు వాగువారు,
చాటునఁ గలుత్రాగి చనుదెంచి తేయాకునీ రానువారి నిందించువారు,
స్త్రీలవంచించి మించి బాధింపనెంచి, యబలలకు విద్య కీడంచు నఱచువారు,
వీరుపూర్వనాగరికులో పెద్ద లిపుడు, దుష్కులాచార రక్షణోద్యోగులకట.

సులభమగు గీతకందములలోనే మంచినీతుల బోధించుటలో మాత్ర మాయన సిద్ధహస్తుఁడు, అసమానుఁడు ననవచ్చును†

వీరేశలింగముగారి వచన వాఙ్మయము చాలవిశాలమైనది. కర్కశముగ నుండక సులభమై సుబోధముగ నుండునట్లు యీయన వచనముల వ్రాయుచుండిరి. ప్రజాహితకరమగు విషయములను జనసామాన్యమునకుఁ దెల్పుటే యీయనసంకల్పము, అయినను ఆయనవచనశైలి పటువై జిగిగల్గి చమత్కృతి కింపుగ నుండును. అట్లని,రంజకముగఁజేయ వ్యర్థమగు సుందరపదములఁ జేర్చి, ఆడంబరయుతముగ వ్రాయుట యీయని కిష్టము కాదు. ప్రవాహమువలె ధారాళముగ నడుచుచు భావగర్భితమై పటువగు స్వచ్ఛవచనశైలి నాంధ్రములో నాయనయే సృజించి,'గద్యతిక్కన' యనిపేరుగాంచెను. కథ, నవల, నాటక మిత్యాదులేగాక, తత్త్వశాస్త్రమును బ్రకృతివిజ్ఞానమును దెలుఁగులో రచించుటలో,ఆయన యెన్నియో సాంకేతికపదములను, పారిభాషికశబ్దములను వాడుకలోనికిఁ దెచ్చి యువకులకు ముందుతరమువారికిని మహోపకారమును జేసినారు. వైజ్ఞానిక గ్రంథములలో నెన్నియో క్రొత్తపదముల వాడుటలో,ఆయన పాశ్చాత్య పదములకు బదులు సంస్కృతాంధ్రపదములనే కష్టపడి కనిపెట్టి వాడుట విశేషము. పాశ్చాత్యభాషపైఁ దనకు ద్వేషములేదు; సరికదా, అందలి మంచివిషయము లన్నిటిని మనము గ్రహింపఁ దగు ననియే యీయనయాశయము. అయినను మాతృభాషలో వీలైనంతవఱకు దేశీయపదములనే వాడఁదగునని, స్వభాష స్వయంసంపూర్ణముగ నుండుటే యుత్తమాదర్శమని యీయన భావించె ననుటస్పష్టము. ఆయనక్రొత్తగ వాడిన పారిభాషికపదము లిప్పుడందఱివాడుకలోనున్నవి కాని, కొన్నిక్రొత్తపదములకు

---

† అన్యులకు దాఁసుఁడయి యుండి యనవరతము
పాయసాన్నంబుఁ గుడుచుచు బ్రతుకుకంటెఁ
దాను బరువేఁడఁ బోక స్వతంత్రవృత్తి, గంజి త్రాగుచు బ్రతుకుట కరము లెస్స.
(నీతికథా మంజరి.)

తెలియఁగఁజాలఁడు మనుజుఁడు, తలపన్ గిరులంతలైన తనదోషములన్
తిలకించుఁ బరులతప్పులఁ బలుకక సన్నావగింజ లంతటివానిన్.
(హరిశ్చంద్ర నాటకము.)

బదు లాంగ్లపదములనే మనవా రిప్పుడు వాడుచున్నారు. ఉ:—మండలకరగ్రాహి (=జిల్లాకలెక్టరు) అనుగతసంయుక్త దండవిధాయి (=జాయింటుమేజస్ట్రేటు) ధూమశకటస్థావరస్థానము (=రైల్వేస్టేషను).

వచనశైలిని దెల్పుటకు, ముందుగ నాయన శాస్త్రగ్రంథముల నుండి కొన్ని యుదాహరణములు క్రింద నీయఁబడినవి. *

---

*అవయవవ్యాపారములను గ్రహించునదియు నడఁపునదియు కేవల మేదస్సేయగు నెడుపక్షమున మస్తిష్కముసహితము తక్కిన యవయవముల వలెనే కొన్ని సంవత్సరములలో సంపూర్ణముగా మాఱి క్రొత్తదగు ననుట శాస్త్రసిద్ధాంతమే. కనుక దానికంతకుఁబూర్వము గ్రహించిన విషయముల స్మరణము మొదలయినవి లేకుండవలెను.... మేదస్సునందు రక్తవాహినులు విస్తారముగాఁగలవు. వానినిఁబట్టి దేహములో నుత్పత్తియయ్యెడు రక్తములో నాఱవవంతు మెదడునకుఁ బోవు నని కొందఱు శారీరశాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు"

"రెండుకర్ణికలును దెఱచుకొని యున్నప్పుడు సిరలదారిని రక్తము వానిలోఁ బ్రవేశించును. అప్పుడు తత్కాలున కర్ణికలు నొక్కసారిగా ముడుచుకొని రెండుజఠరికలు నేకకాలమునందు వికాసము నొందును. అందుచేతఁ గర్ణికలలో నున్న రక్తమంతయు జఠరికలలోనికి వచ్చును." (శారీరశాస్త్రసంగ్రహము)

జ్యోతిశ్శాస్త్ర సంగ్రహము.

"సూర్యుఁడు కేంద్రముగాఁగల భూకక్ష్యయు భూమి కేంద్రముగాఁగల చంద్రకక్ష్యయు సంపాతమగు స్థానములలో నొకదానికి రాహు వనియు, దాని కాఱవరాశిలోని మఱియొక స్థానమునకుఁ గేతు వనియు మనజ్యోతిషగ్రంథములలోఁ బేరులు పెట్టఁబడియున్నవి. గ్రహముల కక్ష్యలు కేవల సమవృత్తములుగాక త్రినాభిచక్రము లనఁబడు దీర్ఘవృత్తములుగా నున్నవి. అందుచేత గ్రహములనుండి సూర్యుఁడును, ఉపగ్రహములనుండి ప్రధానగ్రహములును, ఒకసారి చేరువగాను వేఱొకసారి దూరముగాను వచ్చుచుండును. ఇట్లు గ్రహములసమీపముగా వచ్చు స్థానమునకు నీచోచ్చమనియు, దూరముగాఁబోవు స్థానమునకుఁ దుంగోచ్చమనియు, నామములు."

సూర్యుఁడు తుంగోచ్చమందును జంద్రుడు నీచోచ్చమందును, ఉండునప్పుడు సూర్యగ్రహణము సంభవించుపక్షమున సూర్యబింబము చిన్నదిగాను, చంద్రబింబము పెద్దదిగాను గనఁబడి సంపూర్ణసూర్యగ్రహణ మగును.

తేజోవిహీన మైనమనభూగోళము చంద్రమండలమునకును సూర్యమండలమునకును నడుమ నడ్డము వచ్చి సూర్యకిరణముల మఱుఁగు పఱచి తననీడను జంద్రబింబముమీఁద వ్యాపింపఁజేయుటచేతఁ జంద్రగ్రహణము కలుగును."

ఆయన ప్రయోగములలో "ధారుణి" "మతముయొక్క ఆవశ్యకము" ఇట్టివి శాస్త్రరీత్యా చింత్య మని కొందఱాక్షేపింపవచ్చును. కాని, మొత్తముమీఁద నాయనభాష శైలియుఁ బరిశుద్ధమయినవి. ఆంధ్రులలో గ్రాంథిక వ్యావహారికకలహము చెలరేఁగుచున్నను నాయన యీరెండు పక్షముల యాదరమునకుఁ బాత్రుఁ డయినాఁడు; ఈరెంటికిఁ గొంత సమన్వయము చేసినాఁడు. నిర్దుష్టగ్రాంథికములో సిద్ధహస్తుఁ డగు పంతులుగారు కొన్ని పాత్రలనోట వ్యావహారికమును విరివిగఁ బలికించెను. కాని, అందులోను వికారరూపముల వాడలేదు. మఱియు నారచనలు ముఖ్యముగఁ బ్రహసనతత్త్వములోనివి; శైలి పాత్రోచిత మయినది.† ఇట్టి సమన్వయభావము నాయన స్వీయచరిత్రములోను దెలిపినారు.§

ఆయన తమవ్యాసములను గ్రాంథికశైలిలోనే స్వయముగఁ బ్రకటించినారు. పాఠశాలలలో గ్రామ్యభాషవాడుకను బ్రభుత్వమువారు గుర్తించినప్పు డాంధ్రసాహిత్యపరిషత్తువారొకసభను మద్రాసులో 1912 సం॥లో జరిగించిరి; బడులలో గ్రాంథికమునే వాడవలెనని యాసభవారు దీర్మానించిరి. ఆసభకు వీరేశలింగముగా రధ్యక్షత వహించి యాతీర్మాన మామోదించినారు.

ఆయన శృంగారభూయిష్ఠతను వ్యభిచారిత్వమును దీవ్రముగ నిరసించెను. తనకవుల చరిత్రమునఁ గూడ నట్టి రచనలను ఖండించెను.† తన రసికజనమనోరంజనాదులలోని కొన్ని శృంగారవర్ణనలను దరువాత

† ఈపద్ధతిని గొంతవఱకుఁ వేదం, చిలకమర్తి, పానుగంటి, వారలనుసరించినారు.

§ గ్రంథములను సాధారణముగా సలక్షణమైన సులభశైలిని రచియింపవలెననియే నాయభిప్రాయమైనను విషయానుగుణముగాఁ దత్తదుచితరీతిని గ్రామ్యభాషయందు సహితము గ్రంథములను వ్రాయవచ్చునని కూడ నాయభిప్రాయము. (స్వీయచరిత్రము. 2 వ భాగము. 153 వ పుట.)

† ఆంధ్రకవుల చరిత్రము 2వ భాగము ముద్దుపళని రాధికాసాంత్వనము, శేషం వేంకటపతి తారాశశాంకవిజయమును గూర్చిన విమర్శముఁ జూడుడు.

ముద్రణలో వదలివేసెను. విగ్రహారాధనము సంఘమునకు హానికర మని, దానిని సూచించు బాల్యరచన లగు మార్కండేయశతకమును గోపాల శతకమును గూడ ప్రచురణనుండి తప్పించి వేసెను. (గోపాలశతకములోని యొక్క పద్యమును మాత్ర ముంచెను. కాని, ఎక్కడ ? హేళనగ్రంథ మగు అభాగ్యోపాఖ్యానమునకు మొదట) ఈరెండుశతకముల కవిత్వము బాగుగ లేదని స్వీయచరిత్రములోఁ జెప్పిరి; అది సరికాదని యాపద్యముఁ జదివినవారికి తోఁచకమానదు.*

ఆయన యతిప్రాసములను (గ్రామ్యములలోతప్ప) నరసున్నను బండి 'ఱ'ను దప్పక జాగ్రత్తతో వాడుచువచ్చిరి. అందువలన, పద్యము లలోఁ గొన్నిచోట్ల బెండుపదములను మాఱుమూలమాటలను గూడ వాడవలసివచ్చినది.

ఆయన మొదటిరచనలు భౌతికానందరూపమగు కళాదృష్టితోనే వ్రాయఁబడినను, తరువాతి వచనములలో Art for its own sake అనుసిద్ధాంతము నాయన విసర్జించి, నైతికోద్దేశమును సమకూర్చుటకే తమ లేఖిని నుపయోగించిరి. సంస్థానాధిపతులు, విక్టోరియారాణి, జీససు, శంకరరామానుజాదిమతప్రవర్తకులును, ఇట్టివారి జీవితచరిత్రలలోను, ప్రకృతిశాస్త్రరచనములయందును, వివిధవిషయముల వ్యాసములలోను, తుదకు వినోదరచన లనుకొను ప్రహసనములలోఁ గూడనీతిప్రచారమును, అవినీతినివారణమును దురాచారనిర్మూలనమునుసంఘసంస్కరణమహో ద్యమమును సాధించి యాంధ్రులకుఁ బ్రగతిఁగల్గించుముఖ్యోద్దేశముతోనే ఆయన తఱచు రచనలఁ జేయు చుండెను. కొన్నిరచనలలో వీనినిఁగూర్చి గాఢ మగు నభినివేశము కన్పట్టుచుండును. ఆయన కావ్యములలోను గొన్ని కాంతాసమ్మితములుగ నుండక,సుహృత్సమ్మితములుగ నున్నవి. ఒకప్పు డావేశముతో వ్రాయుచుండుటచేఁ బ్రత్యర్థులతో వాగ్వాదమును సంఘ

* శ్రీరమణీ హృల్లోలా, కారుణ్యాలవాలవాల, కాంచనచేలా
ఘోరాహవజయశీలా, శ్రీరాజమహేంద్రి వరపురీ గోపాలా.

క్షణయును వెలిగి పరస్పరదూషణమును గల్గుచుండెను. (ఆయనశీఘ్రకోప మిట్టి పరిణామమునకుఁ గొంతకారణ మగుచుండెను) న్యాయపక్ష మని తోఁచినదానిని సాధించుట కాయన చూపినపట్టుదల యద్భుతము.

## తత్త్వము—భావములు.

వీరేశలింగముగా రాకారమునఁ గొంచెము పొడగరి. దుర్బలదేహుఁడై, దగ్గుబాధ గల్గియుండెను. కాని కండ్లలోని మంచికాంతియు సౌమ్యతయు నాయనప్రతిభను దయాపరత్వమును సూచించుచుండెను. ఆయన స్వార్థత్యాగి, సంఘసేవాపరుఁడు. దంపతులు గాఢప్రేమఁ గల్గియుండిరి. తమకు పిల్లలు లేకున్నను, ఎందఱినో పిల్లలననురక్తితోఁ బెంచి పోషించి, వారికిమంచివిద్యాబుద్ధులఁ గఱపిరి. భార్య పూర్వాచారపు సంప్రదాయ మం దుండియు, వితంతు శరణాలయము సాఁగించుటలో, వివాహాదుల జరుపుటలోను, ఆయన కన్నివిధములఁ దోడుగ నుండెను. అర్ధాంగియు కొందఱు సహచరులును, కాలము చేసినప్పు డాయన వ్యథితుఁడై, అసహాయుఁడై కష్టములపా లాయెను; కాని, సమాజభీరతను, కార్యదీక్షను, తన ధార్మికనియమములను, మానలేదు.

రాజకీయములందు వీరేశలింగముగారు 'మితవాది' యనవచ్చును. రమారమి 30 సం ట్లాయన ప్రభుత్వోద్యోగి; 1907 సం॥లో పాలుగారి ప్రాంతమునకు వచ్చినప్పటినుండి యువకు లనేకులు జాతీయోద్రేకమునకు వశులైరి; ప్రభుత్వచర్యలతో పాటుద్యోగులను దూషించుచు, కొందఱు హింసాభావమును జూపిరి. ఈధోరణిని వీరేశలింగముగారు తీవ్రముగ ఖండించిరి. అంతట దీని నపార్థముచేసికొని యాయనశిష్యులలోఁ గూడ కొందఱాయనకు రాజభక్తుఁడు దేశద్రోహి యని నిరసించి, ఈయనకు లేని దోషములు గూడ నారోపించిరి. కొందఱు వంగీయులవల్ల నాసమయమందే రవీంద్రునికిని నట్లే జరిగినది. రవీంద్రునియంత కాకున్నను, వీరేశలింగముగారును దేశాభిమానియే. దేశాభివృద్ధి కాటంకముగల్గించు నవ

రోధములఁ దొలఁగించి మన దీనదరిద్రదేశము నున్నతస్థితికిఁ దేవలయు నని యాయన చాలచోట్లఁ దెల్పెను. ‡

దేశీయమహాసభఁ గూర్చియు, దాని యాశయములఁ గూర్చియు, మనదేశపు స్వదేశసంస్థానాదులఁగూర్చియుఁజాల మంచివ్యాసముల నాయన వ్రాసెను. ఏ దైన రంగమున కార్యపరు లగుట యాయన కోరిక. తాను దేశోన్నతికై సాంఘికరంగమున దీక్షతోఁగృషిచేసెను. కాని యతివాదులనఁబడు జాతీయవాదులు రాజకీయముగఁ దీవ్రవాదులైనను, వారికప్పుడు నిర్మాణాత్మక మగుకార్యక్రమము లేకుండెను. వట్టి కేకల వలన స్వాతంత్ర్యము రా దనియు, మనలోని సాంఘికలోపములను ముందుగాఁ దొలఁగింపఁ బనిచేయవలె ననియు, మఱియు మన యభివృద్ధి సర్వతోముఖముగ నుండవలె ననియు, అప్పుడే నిజ మగు జాతీయాభివృద్ధి యుండు ననియు నాయన భావము.*

ఆయన సర్వమతములఁ గూర్చి యుదారభావము వహించెను; యేసుక్రీస్తుచరిత్రను వ్రాసి, జీససు దేవుఁడు కాకున్నను ఉత్తమపురుషుఁ డని నిరూపించెను. హిందూమతమం దాయన గాఢభక్తిగల్గి, వేదాంత విషయములను బాగుగఁ బరిశోధించెను. ఆధ్యాత్మికవిషయములచర్చ కాయన చాల వ్యాసముల వినియోగించెను. మతత్రయప్రవక్తలగు

‡ 'దేశాభిమానము, విద్యాధికుల యగ్రకృత్యములు' మొదలగు వ్యాసములఁ జూడుఁడు. (7 వ సంపుటం)

* దేశాభివృద్ధి యనఁగా దేశమందలి జనులయభివృద్ధియు. నిక్కమయిన దేశాభిమానము గలవారి కందఱికిని జనులయొక్కస్థితిని బాగుచేయుటకై ప్రయత్నముచేయుట విధి. (4 వ సంపు. 547) ఎవ్వరు లోకులకుపకారముగా దేశాభివృద్ధికివలయు పని నొక్కదానినైనను జేయుదురో వారిదిమాత్రమే సార్థకజన్మము (పు. 570)

పరోపకారమైన యీదేశాభిమానమును మనము బాల్యమునుండియు నభ్యాసము చేయవలెను. దేశాభివృద్ధినిగోరెడు నిజమైన దేశాభిమాని తనదేశమునం దేమి చెడుగున్నను దానిని రూపుమాపి దేశమును బరిశుద్ధిపఱుచుటకై ప్రయత్నింపవలెను. అట్లు చేసినఁగాని దేశము సుఖవంతిమయి స్వాతంత్ర్యలాభమునను భవించుటకు శక్తముకాదు. (9 వ సం. 270 పుట)

శంకర రామానుజ మధ్వాచార్యుల జీవితచరిత్రలు వ్రాయుటయేగాక, ద్వైతాద్వైతాదిశాఖల ప్రత్యేకసిద్ధాంతములను, పరస్పరసామ్యభేదములను సామాన్యులకుఁ దెలియుచక్కనిభాషలో విశదముగ వెల్లడించెను.

ఈశ్వరోపాసన ప్రార్థనాదుల నెట్లు చేయవలయునో, అందువలన నాత్మపరిశుద్ధియు జీవితపరమార్థ మెట్లు లభించునో, ఆయన విపులముగ వివరించెను. దానధర్మములు వైరాగ్యము భజనలు సదుద్దేశముతో నాత్మోన్నతికి సంఘక్షేమమునకును మాత్రము చేయఁబడినప్పుడు హర్షింపఁదగినవే; కాని మతముపేరిటఁ బైకివైరాగ్యము నటించుచు, దేవాలయాదులలో స్వార్థపరతకు బాహ్యవేషములతోఁ జేయుభజనలను, ఆయన నిరసించెను.

మతధర్మ మేదియో నరుఁ డీశ్వరప్రీతిఁ గల్గించు టెట్లో ఆయన తెల్పినభావములును క్రింది యుదాహరణలవల్లఁ దెలియును. విగ్రహారాధనమును నతిబాల్యవివాహమును నిర్బంధవైధవ్యమును హిందూధర్మశాస్త్రములకు మతకర్తల వచనములకు విరుద్ధమనియు సనాతనహిందూమతమునకు వ్యతిరిక్తమనియు నిరూపించుట కాయనయెన్నియో శాస్త్రప్రమాణములను దమ వ్యాసములలోఁ జూపెను*

---

* మనుష్యుల కనుష్ఠేయమైన సమస్తధర్మములును మతధర్మము లని యే చెప్పవలసియున్నది... మనమేపనిని జేసినను బరమేశ్వర ప్రీత్యర్థముగానే చేయుచుండవలెను. ...

*వ్యాసములయందాయన చర్చించిన కొన్ని కారికలీక్రింద నుదహరింపఁబడినవి. 'ఆత్మ సంస్థం శివం త్యక్త్వా బహిస్థం యజతేశివం' హస్తస్థం పిండ ముత్సృజ్య లిహేత్కూర్పరమాత్మనః। (స్కాందపురాణము) 'యోమాం సర్వేషుభూతేషు సంతమాత్మానమీశ్వరం' హిత్వార్చాంభజతే మౌఢ్యాత్ భస్మన్యేవజుహోతిసః. భాగవతము) 'నచక్షుషాగృహ్యతే నాపివాచా... పశ్యతే నిష్కలంధ్యాయమానః (ముండకోపనిషత్తు) సోమః ప్రథమోవివిదేగంధర్వో... 'ఉదీర్ష్వాతో విశ్వావసో... (ఋగ్వేదం) 'కన్యాత్వక్షత యోనిస్స్యాత్' (గౌతమ) త్రీణివర్షాణ్యు దీక్షేత...'(మను) ఇయం నారీ పతిలోకం...తస్యై ప్రజాం ద్రవిణం చే హ దేహి (యజుర్వేదం). నష్టేమృతే ప్రవ్రజితే క్లీబేచ...పతిరన్యోవిధీయతే'(మను పరాశరస్మృతులు)

పౌరాణికగాథలవదలి యుపనిషన్మతమునే హిందూధర్మముగస్థిరప
ఱుచుట కాయన చాలఁ గృషిచేసెను. శ్రుతిస్మృతులలోను ప్రాచీనజ్యో
తిశ్శాస్త్రములలోను సంఘశ్రేయస్కర మగుచున్నతాశయములు వైజ్ఞానిక
భావములునే చెప్పఁబడె నని యాయన ప్రమాణచర్చతో నిరూపించుచుం
డెను. స్థిరమగు ప్రగతి కావశ్యకమగు (అట్టి యనంతరము)యాచరణకుఁ దేఁ
బడినయప్పటి జాతీయనిర్మాణకార్యక్రమమును వీరేశలింగముగా రప్పుడే
చాలవఱకు సమర్థించియుండిరి గాఢమగు దైవభక్తి నాయన యెన్నఁడును
విడువకుండెను. ప్రస్తుతము వర్ణాశ్రమముల పేర నాచరణలోనున్న కుల
తత్త్వమును సాంఘికవిభేదములను, విగ్రహారాధనపద్ధతిని, నిమ్నజాతుల
నణఁచుట, నిర్బంధవైధవ్యాదులను నాయన తీవ్రముగ నిరసించినసంగతి
నిజమే. కాని అవి యన్నియు వేదమతములోనివి కావనియు, పరిశుద్ధ
హిందూధర్మమునకు వ్యతిరిక్తమనియు దృఢవిశ్వాసముగల్గి, పరిశుద్ధా
స్తికమతమును వ్యాపింపఁజేయుట కాయనగాఢకృషిజేసెను. క్రిందటిరెం
డుశతాబ్దులలో గల్గిన యధోగతినుండి ధార్మికసాంఘిక రంగములందు
మనమాతృదేశమును పునరుద్ధరించుటకు, బెంగాలులో రామమోహన
దేవేంద్రనాథ ఈశ్వరచంద్రాదులును, పశ్చిమమున దయానందాదులును,
దక్షిణమున సుబ్రహ్మణ్యాదులును చేసిన సంస్కరణపు మహాకార్య
మునాయన యాంధ్రప్రాంతములో చేయగల్గెను. తానిక్కడ వ్యాపింపఁ
జేసిన బ్రాహ్మసమాజమును పరిశుద్ధమగు నుపనిషన్మతస్వరూపమేయని,
ఆయన తనవ్యాసములలో నిరూపించెను.

అహింసయందును ఆయనకు గాఢాభిమానముండెను, సత్యప్రేమ
లురెండును దేవస్వరూపపు చిహ్నములనవచ్చు. 'ఋతం సత్యంపరం
బ్రహ్మ'కదా! కులభేదముల నిర్మూలింపఁ బూనుటలో తీవ్రవాదమును
పరస్పరనిందయు. జరుగుచుండినను, ఆ మాసంఘములకు కులములకు మ
ధ్యవిభేదములను తొలగించి, పరస్పరం సాంఘికమైత్రిని చేకూర్చుటయే
ఆయనసాగించిన సంఘసంస్కరణకృషిలోనిమూలభావము. ఆయన హిం

దూ శాఖలమధ్య సామరస్యము గల్గింపఁ బూనుటే గాక, హిందు, బౌద్ధ క్రైస్తవాదిభిన్నమతముల మూలసిద్ధాంతము లొకరీతివే యనియు, ఈశ్వరుఁడు సర్వమత సముఁడనియు నిరూపించుచుఁ జాలవ్యాసముల వ్రాసెను. అసత్యపరత్వము నాయన తెఱుచు ఖండించి, సత్యవిశ్వప్రేమలు సదాచారమూలసూత్రము లని వెల్లడించి, ఆయాదర్శము జనులలో వ్యాపింపఁజేయుట కాయన ప్రహ్లాదహరిశ్చంద్రులకథలను వ్రాసి వానికిదృశ్యకావ్యములరూప మిచ్చెను.§

అప్పటి పూర్వాచారపరు లాయనను నాస్తికుఁడని దూషించినను, వీరేశలింగముగా రత్యంతధార్మికుఁడు; మానవ సౌభ్రాతృత్వమును బరిశుద్ధజీవితము నే యీశ్వర ప్రీతికరములు, మతధర్మమును దానితోపాటు సంఘమం దితరులస్వాతంత్ర్యమం దాదరమును గమనింపవలె

---

§ ప్రహ్లాదనాటకము తుదను (విష్ణువు భరతవాక్యములో) నిజ మగుభక్తు లెట్లుండవలెనో యిట్లు చెప్పిరి.

సీ. దుడ్డునామము పెట్టి తులసిపేరులు దాల్చి మొక్కు-మాత్రైన మీకు ముక్తిలేదు
నాపాదభక్తు లై ననుదృప్తుఁ జేయఁగఁ దలతురేనియు మీరు తెలియ వినుఁడు
ముందుగా మీరలు భూతకోటులయందు దయఁగల్గి సత్యంబుఁ దప్ప కెపుడు
కామాదుల జయించి కరుణాప్రపూర్ణులై పరవంచనములేక పరవనితలను
తోడబుట్టువు లట్లుఁ దోడిమానవులను సోదరు లట్లును జూచుకొనుచు
నీతిమార్గంబున నిత్యాదరముతోడ మీరెల్ల నిరతంబు మెలఁగవలయు
ఆ.వె. చిత్తశుద్ధిలేని సేవచే నెంతయుఫలము లేదుగాన భక్తితోడ
నన్నుఁగొల్చుచుండి నాకుఁ దృప్తి నొసఁగుపనులు సలిపి ముక్తిపదవిఁ గనుఁడు.

హరిశ్చంద్రనాటకములోని యీ క్రింది ద్విపదలోను భగవంతునుద్దేశించి యిట్టిభావమే తెలుపఁబడినది.

ద్వి. దయయు సత్యంబును దప్పక నీదుప్రియమైన కార్యముల్ ప్రేమమీఱంగ
సతతంబు భువిలోనసలిపెదు బుద్ధి నతులానరించెద నాకీయవయ్య
నీదుభక్తులయెడ నిత్యంబు నాకు నాదరమొనరెడున ట్లొనరించి
జను లెల్లరను భ్రాతృసములనుగాఁగ వనితలఁ దోబుట్టుపడుచులుగాఁగ
భావించుకొనుచును వారిక్షేమంబు భావంబులోఁగోరి పనిచేయునట్లు,
నాకుప్రసాదింపు న్యాయస్వరూప.

నని యాయన బోధించి, తాను నట్లే యాచరించెను† నిజముగ మానవ సేవయే మాధవసేవ. దురాచారములఁ దొలఁగించినప్పుడే దేశమున కున్నతిగల్గును, అందులకు యత్నించుట దేశాభిమానులధర్మ మని యాయన దృఢవిశ్వాసము స్పర్శభోజనాదులఁ గూర్చియుఁ వివాహానిషేధముఁ గూర్చియు మధ్యకాలమం దేర్పడినయాచారములు శౌచాదినియమముల నిమిత్త ముద్దేశింపఁబడె ననియు, కాలక్రమమున క్రొత్త పరిస్థితులలో నివి నిరుపయోగ మయినను యాబాహ్యాచారములనే మత సారముగ భావించుటయు, కొందఱు దమకన్న హీనస్థితిలో నున్నవారిని బాధించుటయు, మనలో విరోధము లేర్పడుటకుఁ గారణ మయిన వనియు, వానిని వదలి ప్రజ లైకమత్యము సాధింపవలె ననియు, సాంఘికైక్యము లభింపఁగనే జాతీయోన్నతి యేర్పడు ననియు, ఆయన భావము*

వీరేశలింగముగారిజీవితకాలమందు హరిజనోద్ధరణకార్యము జాతీయజీవితమునఁ బ్రాముఖ్యము వహింపలేదు; కాని, ఆయన అస్పృశ్యతానివారణకార్యమున కన్నివిధములను సుముఖుఁడు; ఆయన కులవిభేదము లనలే గమనింపని యానుష్ఠానికబ్రాహ్మ్యుఁడు; బ్రాహ్మసమాజికులు హరిజనుల నస్పృశ్యజాతిగ నెంచవీలులేదు; వారిదేవాలయములలోను ప్రార్థనామందిరములలోను హరిజనులనుగూడ పాల్గొననిత్తురు. సనాతనుల దేవాలయములలో విగ్రహామునకు సంపర్కదోషము కల్గు ననుచు నిప్పుడు 'సనాతనులు' హరిజనుల రానిచ్చుటలేదు; విగ్రహారాధనము

† "తోడి మానవులయెడ భ్రాతృభావము వహించి యన్యోన్యక్షేమాభివృద్ధులకై పాటుపడుచు నెవ్వరిని ద్వేషింపక యెవ్వరిని వంచింపక యెవరికి నన్యాయము చేయక వర్తించుటయే యీశ్వరునికిఁ బ్రీతికరము... కాఁబట్టి నిజముగా నీశ్వరభక్తుఁడు కావలెనన్నవాఁడు మొట్టమొదట సత్యమునం దాదరము గలవాఁడును న్యాయమార్గమునను వర్తించువాఁడును భూతదయాపరుఁడును, కావలెను... మతధర్మము పరిశుద్ధము కానియెడల సమస్తస్వాతంత్ర్యములును జెడును. ఎవరిస్వాతంత్ర్యములు వారి కుండునట్లు చేసి యందఱిని సౌఖ్యసంతోషములను బొందునట్లు చేయుటయే మతధర్మము యొక్క ముఖ్యకార్యము.

* దేశాభివృద్ధిని గోరెడు నిజమైన దేశాభిమాని తన దేశమునం దేమి చెఱుగున్నను దానిని రూపుమాపి దేశమునుబరిశుద్ధపఱచుటకయి ప్రయత్నింపవలెను ('మతధర్మము. 9 వ సం. 269,270 వ పుట.')

మూఢులకుఁ బామరులకునే యని శాస్త్రములే చెప్పుచున్నవి; ఆయన హరిజనోద్ధరణ భారతస్వాతంత్ర్యమున కవసర మనియు భావించెను †

సాంఘికమైత్రివలె స్త్రీజనోన్నతియు జాతీయనిర్మాణకార్యాంశములలో నొకటి. స్త్రీలయభివృద్ధికి వీరేశలింగముగారు జేసిన కృషి యపారము. బాలికలవిద్య కాయన ప్రచారముచేసియు స్వయముగ బడుల నడిపియు, స్త్రీలను బెంచి పోషించియుఁ దోడ్పడిరి; స్త్రీలయారోగ్యము కాపాడుట కుపయుక్తమగు గ్రంథములనుగూడఁ బ్రచురించిరి; అతిబాల్యవివాహము సంఘమున కంతకు—ముఖ్యముగ స్త్రీలకు—చాలహానికర మని కనిపెట్టి, దాని నంతరింపఁజేయుట కెంతో పనిచేసిరి; స్త్రీలకెక్కువ బాధక మగు నిర్బంధవైధవ్యకష్టములు తగ్గించుట కాయన వితంతువివాహములు సాగించుట కెంతో వ్యయప్రయాసములపాలై కార్యశూరుఁడై, వితంతుశరణాలయములు స్థాపించి, ధైర్యౌదార్యములతో వానినాదర్శప్రాయముగ నడిపిరి. ఆయన సాహిత్యరచనలలో స్త్రీజనోన్నతి కుద్దేశించినవి చాలఁ గలవు. పత్నీహితసూచని సతీహితబోధిని ఉత్తమస్త్రీచరిత్రములు మున్నగు స్త్రీలకు విజ్ఞానమునిచ్చు గ్రంథములెన్నిటినో యాయన సులభశైలిలో వ్రాసిరి. స్త్రీవిద్య అతిబాల్యవివాహము, విధవలస్థితి, ఇట్టివానినిగూర్చి ప్రత్యేకనాటకముల రచించిరి. సత్యరాజా పూర్వదేశయాత్రల 'ఆడమళయాళము' లో మనదేశపు స్త్రీలస్థితి హీనము కనుక వారి యుద్ధరణ మవసరమని సూచించిరని గమనించియున్నాము.

---

† "మనవారు మాలమాదిగలయెడలఁ జూపెడియన్యాయము మానవనామధారకులకెల్ల నవమానకరముగానున్నది... హిందువుగానున్నసేనఁడుమాత్రమే యస్పృశ్యుఁడును అనాచ్యుఁడునగును గాని యాచెప్పరానివాఁడే క్రైస్తవమతమునో మహమ్మదీయమతమునో యవలంబించి జానో ఖానో కాఁగానే తాఁకఁదగినవాఁడును మాటాడఁదగినవాఁడును నగుచున్నాఁడు... పంచముల నిట్లు పలుతెఱఁగుల బాధించు మనమే న్యాయమును జెప్పి జేతలగు పరదేశీయుల నధికస్వాతంత్ర్యముల నిండని వేడఁగలము? ...ఇట్లు చెప్పుటచేత మన కర్హమైన స్వాతంత్ర్యములను మనము పొందఁ బ్రయత్నింపరాదని నాయభిప్రాయ మెంతమాత్రమును గాదు... కార్యములచేతనే గాక క్రియలేని వాక్యములచేత దేశ మెప్పుడును బాగుపడదు."

విక్టోరియాచరిత్రము మాతృపూజ మున్నగునవియు స్త్రీల కుద్దేశించినవే. ఆరోగ్యాదిరక్షణఁగూర్చి తమదినకృత్యములలో స్త్రీలు పాటింపఁదగినవిషయముల నాయన వివరించి వ్రాసెను. స్త్రీల కున్నతి గల్గింపవలెనని కోరినను, కొందఱు పాశ్చాత్యస్త్రీలవలె మనవారు దమపురుషుల ధిక్కరించుటయు పురుషులను మాయచేసి బాధించుటయు మంచిది కాదనియు, పతితోడిదే సతీజీవిత మనియు, స్త్రీలు కష్టపడి గృహకృత్యాదుల నిర్వర్తింపవలె ననియు, ప్రాచ్యాదర్శములే యువతుల కనుసరణీయముగఁ దెల్పెను† ఇప్పటికిని మనప్రాంతపుస్త్రీలలో నూటి కిద్దఱుమాత్రమే యక్షరజ్ఞానము కలవారు. జాతీయక్షేమమునకై హరిజనులకు స్త్రీలకు నున్నతిగల్గించుట యావశ్యక మని 1919 సం॥కుఁబూర్వ మీదేశమునఁ గనిపెట్టి వానికిఁ బ్రాముఖ్య మిచ్చినవారు చాల తక్కువ. అందు కప్పటికాంధ్ర ప్రాంతములో నాయనయే ముఖ్యముగ కృషిచేసెను. ఆయన తరువాతనే గాంధిగారు వానిని జాతీయనిర్మాణకార్యాంశముగఁ జేర్పించిరి. అప్పటికి జనులనుండి (ముఖ్యముగ పూర్వాచారపరులగు విద్యావంతులనుండి) తీవ్రప్రతిఘటన కల్గుచుండినను, తమపై నాంక్షలు బహిష్కారములు సాఁగుచుండినను, తమ్ముఁ లొంగఁదీయుట కభియోగములు ముష్కరచర్యలుగూడ సాఁగుచున్నను, వాని నన్నిటిని సహించి ధైర్యముతో నెదుర్కొని, ఎదురీఁతఁ యీఁది, ఆప్రజాహితకార్యములనాయన సాధించుచుండిరి. ఈరంగములం దిప్పటి కాంధ్రప్రాంతములోఁ గలిగిన ప్రగతికిఁ జాలవఱ కాయనకృషియు, ఆయన తనశిష్యమిత్రులలోఁ గల్గించిన యుత్సాహాభినివేశములును గారణములు. మొత్తము సంఘమంతటిలో నర్ధాంశమగుస్త్రీలును హిందూసంఘములో దాదాపు నాల్గవవంతును కార్మికముఖ్యులునగు హరిజనులును హీనస్థితిలో నున్నంతకాలము మనకు జాతీయాభివద్ధి సరిగాఁ గలుగ దని మూఢులకును దెలియవలసినదే. కాని

† సర్వసౌఖ్యము లొంద సాధ్వీమణులకుఁ బతియే నిదానంబు పర్వేందువదన ...కావునఁ బతియాజ్ఞఁగలలోనసైన మీఱక మెలఁతుక మెలఁగంగవలయుఁ కష్టపడిఁనగాని కరము సౌఖ్యంబు కలుగదెవ్వారికిని క్ష్మామండలమున, కావునదేహంబుకడు దాఁచుకోక పనిపాటులనుజేసి పతిచిత్తమెఱిఁగి ప్రేమంబు భక్తియుఁ బ్రియము జూపుచును వీరవర్తనంబున వర్తింపవలయుఁ. (సత్యాదౌ్రపదీసంవాదము.)

క్రియలో, నీయుద్యమములకు రెంటికిని నింతవఱకు మనప్రాంతపు ప్రజా ప్రముఖులు తీవ్రకృషి చేయనందున నవి వెనుకఁబడియున్నవని యంగీకరింపక తప్పదు. మనవారల స్వార్థపరతను మూఢత్వమును పోఁగొట్టుట కాయన చేసినకృషి యమూల్యము.

నిర్మాణకార్యపు ముఖ్యాంశములలో నూలువడకుట, కాగితము ఇత్యాదుల కుటీరపరిశ్రమలుగఁ జేయుటయు ముఖ్యముగ నిప్పుడు భావింపఁబడు చున్నది. వీరేశలింగముగారికాలమున కాయుద్యమపుఁ బ్రచారము లేదు. ఆయన యప్పటిరాజకీయదృక్పథమును వేరు; కాని పూర్వ మీదేశము మంచిస్థితిలోనుండి యిప్పుడు హీన మయిన దనియు, జనుల యార్థికస్థితిని బాగుచేయవలె ననియు, ప్రతివారును సోమరితనమును వదలి స్వయంకృషికిని స్వకాయకష్టనిర్మాణకార్యములకునుఁ బూనవలె ననియుఁ బ్రజోపయోగకరమై న్యాయమగువృత్తి యేదయినను మంచిదే యనియు నాయన యభిప్రాయము †

ఇట్లే మద్యపానము చాల హానికరముగ పరిణమించు ననియు కనుక

† పరులను యాచించి జీవనము చేయుటకంటె హేయమగువృత్తి మఱి యొకటి లేదు...లోకములో న్యాయ మయిన వృత్తులన్నియు గౌరవావహములే. మనకు సామాన్యముగాఁ గావలయువస్తువులును విదేశములనుండి వచ్చి మనసొమ్మంతయు నితరదేశములపా లయి మనదేశ మంతకంతకు బీదస్థితికి రావలసినంతగతి పట్టినది. పనికి పూని చేయ నారంభించినచోఁ గాలము తనంతనే వచ్చును.

(7 వ సం॥ 248_26 పు. స్వయం కృషి)

మనము శరీరప్రయాసము నెన్నఁడును దిరస్కరింపరాదు. ఎల్లవారును నేదో యొకవిధమునఁ బాటుపడి గౌరవముతో జీవనము చేయుట కయి ప్రయత్నింపవలయును. శిల్పాదులయందుఁ బ్రవేశించిన విద్వాంసులు యంత్రముల నిర్మించి వానితోఁ బనిచేసెడు దేశములకుఁ బోయి నిర్మాణకౌశలమును జేయుక్రమమును గనిపెట్టి యనుభవజ్ఞానమునుగూడ సంపాదింపవలయును. మీరు మీస్వాతంత్ర్యమును మాటలచేత మాత్రమే కాక కార్యములచేతఁగూడ లోకమునకు వెల్లడిపఱిచి శిల్పాదివృత్తులయందు మీలోఁ దగినవారు ప్రవేశించి యితరులకు దారిఁజూపి లోకోపకారధురీణు లగుదురని కోరుచున్నాను. ('సకాయ కష్టకర్మలు.')

జనులలోఁ ద్రాగుడు నెట్లైన మాన్పింపవలె ననియు నాయన యత్నించి బోధించెను†.

అప్పటికి సామాన్యభాషాప్రచార మీప్రాంతములో వ్యాపింపలేదు. ఆసమస్య నాయన చర్చింపలేదు.

నిర్మాణకార్యాంశములలో నొకటి స్వభాషాభిమానము. అది ఆయన కతిగాఢముగనుండెనని వేఱుగఁ జెప్పనక్కఱలేదు. ఆంగ్లులనువారి భాషను ప్రభుత్వమును జాల మన్నించినను, ఆయన తన జీవిత మంతను స్వభాషను నందలి వాఙ్మయమును వృద్ధిచేయ వినియోగించెను. మాతృభాషలోనికిఁ గ్రొత్తపదజాలమును శైలిఁ గ్రొత్తరకముల రచనలను దెచ్చి ఇతరులకు వాఙ్మయవృద్ధికి దారిఁజూపెను. ముఖ్యముగ ప్రజలలో జాతీయ జీవితవృద్ధి కవసరమగు సులభశైలిలో మంచివచనవాఙ్మయమును, అప్పటి సంఘావశ్యకతలకుఁ దగినట్లు నిర్మించెను. మూఢత్వము వదలి విద్యావంతులు కండని జనుల హెచ్చరించుటే కాక తాను స్వయముగ బోధించి పాఠశాలలుగూడ నడుపుటయు, ఆయన స్వభాషాభిమానమునకు సూచకము. జనుల కారోగ్యమును బరిశుద్ధిపద్ధతులను సులభచికిత్సలను నేర్పుటకును దగిన వాఙ్మయమును సృజించెను.

ఆయన జీవితము చాలవఱకు పురము లందే గడచెను. కనుక గ్రామోన్నతి కాయన ప్రత్యేకకృషిఁ జేయలేదు. అప్పటి కాసమస్యకును ప్రాముఖ్యము రాలేదు. దేశమందలి ఆర్థికరాజకీయపరిస్థితులపైన దృష్టిని కేంద్రీకరింపలేదు. కాని జూదము, త్రాగుడు, సోమరితనము, అజ్ఞానము, మూఢాచారములు మొదలగు గ్రామజీవితపు సాంఘికదోషములఁ బోఁగొ

† ఈక్రైస్తవప్రభుత్వము మనదేశమునకు దిగకపూర్వము మనదేశము తక్కిన దేశములకంటె మిక్కిలి మంచిదశయందే యుండియున్నది. మనపెద్దలు సురాపానము మహాపాతకముగా నేర్పఱిచి, పానమత్తులతో సహవాసముచేసినవారిని సహితము మహాపాతకులలో గణించుచు వచ్చినారు. త్రాగుబోతుల వ్యాప్తి యాలమునఁ జాల తక్కువగా నుండెను. మనదేశస్థు లందఱును జేరి, త్రాగుబోతుతనమును నిర్మూలించుటకయి తగు ప్రయత్నము చేయవలయును. (త్రాగుడువలె తక్కిన మాదకద్రవ్యములను దుర్వృత్తులను గూడ ఆయన నిరసించెను.)

టుట కాయన చాల వ్యాసముల రచించి, కృషిచేసెను. ఇందునుగూర్చి ఆయనదృక్పథము చాలవఱకు 'రాజశేఖరచరిత్రము'లో వ్యక్తమైనది.

నిర్మాణకార్యాంశములలోఁ దుదిది ఆర్థికసమత్వము. ఇదియు నాయననాఁటికి ప్రాముఖ్యమునకు రాలేదు. ఆయన దీనిని తనరచనలలోఁ జర్చింపలేదు. కాని ధనమందును సంఘవ్యత్యాసమునందును ఆయనకు మోహము లేదు. తాను కష్టపడి సంపాదించినసొత్తునంతను ప్రజోపయోగమునకై సాంఘికోన్నతిఁగల్గించు ధర్మసంస్థల సాఁగించుట కిచ్చివేసెను. తా నట్టిసంస్థలను స్వయముగా స్థాపించెను; ఈయున్నతాదర్శమం దితరులకు దారిచూపెను; స్వకీయ శ్రమజీవితమే యుత్తమ మనియు, ధనాఢ్యులు తమకు దేవుఁ డిచ్చినద్రవ్యమును ధర్మకర్తలవలె ప్రజాలాభమునకు వినియోగింపవలె ననియు (గాంధిగారివలె) నుద్బోధించెను.

నవ్యవాఙ్మయమున కాయన మార్గదర్శకుఁ డందురు. పూర్వకాలపు పరిస్థితు లిప్పుడు మారినవి. ఇప్పటి నవ్యాంధ్రవాఙ్మయములో గీతికావ్యములు చిన్నకథలు ప్రముఖస్థాన మందున్నవి. వీరేశలింగముగారు వానికి ప్రాముఖ్య మీయకున్నను అన్నివిధములరచనలఁ జేసిరి. కాని ఊహాప్రపంచమం దూఁగుచుండక సంఘపు ప్రత్యక్షసమస్యలను స్వకీయముగ నెంచుకొని లోతునకుఁ బోయి, వాని నెల్లైన పరిష్కరించుట కని యసిధారావ్రతముతో నాయన తనలేఖిని నాయుధముగ నుపయోగించెను. తనకాలపు సంఘలోపములఁ బోఁగొట్టుట కితరులతోపాటు కవియు యత్నింపఁ దగు నని యాయనతలంపు. వానిలోఁ జిక్కుకొనక శాశ్వతసత్యములపై నను నిరవధికానందముపై నను దృష్టి నుంచి ప్రేమతత్త్వమును వృద్ధిచేయుట చాలవఱ కిప్పటినవ్యకవుల యాదర్శము. వారిది ప్రజ్ఞాసూచకమై చాలవఱ కానందమయమగు గగనవిహారము. (అందులోను నక్కడక్కడ నిట్టూర్పులు కన్నీరును గలవు.) రవీంద్రుఁ డిట్లే రచించె నందురు. కొంతవఱకు మొదట కేవల శృంగారగీతములను భావగర్భితకథలను వ్రాసినను, తరువాత త్వరలో రవీంద్రుఁడు తత్త్వము కొంత మార్చుకొనెను. నేలవిడిచి సాము చేయుటలేదు; ఆయన యుత్తమనీతిని బోధించువానినిరచించెను. ఆబోధ చాలవఱకుధ్వనిరూపము. వీరేశలింగముగారి రచనలలోఁ

ప్రత్యక్షబోధకమే హేతువు. ఉభయుల గ్రంథములలోను సంఘలోపములఁ బోఁగొట్టుట కావేశమును, ఆధ్యాత్మిక ప్రవృత్తియు, ఉన్నతాదర్శము లును గోచరించుచున్నవి. ఏదేశమం దైనను జాతీయ ప్రగతికి వాఙ్మయ మొక ముఖ్యసాధనమై తోడ్పడవలెను. అందును బరాధీనమై ధైర్యవి ద్యారోగ్యాదివిషయము లన్నిటిలో హీనమై పరస్పరకలహములతోఁ గలుషితమగు మనసంఘమునకుఁ బ్రగతిప్రేరకమగు వాఙ్మయ మత్యా వశ్యకము. అట్టిదాని నిర్మాత యుగపురుషుఁ డనఁదగును. సాంఘికవ్యాస ములు,ధార్మికరచనలు,జీవితచరిత్రలు,విజ్ఞానరచనలు,నీతికథలు, నవలలు, నాటకములు, ప్రహసనములు, వాఙ్మయవిమర్శ, ఇట్టి వివిధరంగములం దాయన చేసిన రచనలు క్రాంతికారులైనవి. ఆంధ్రమందంతటి ధీరప్రవక్త యింకను మరల రాలేదు. కాని యాయన చూపిన మార్గములఁ జాల మంది నవ్యకవులు ముందంజవేసి ప్రఖ్యాతిఁ గాంచుచున్నారు. జాతీయో న్నతి నిచ్చు ప్రగతికావ్యములలో రాయప్రోలు సుబ్బారావు విశ్వనాథ సత్యనారాయణ ఉన్నవ లక్ష్మీనారాయణ గారలు రంజకహాస్యరచనలలో చిలకమర్తి పానుగంటి లక్ష్మీనరసింహారావుగారలు, సులభపద్యకావ్యము లలోఁ దిరుపతి వెంకటేశ్వరకవులు, శతాధికవిపులగ్రంథరచనలో శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు, వాఙ్మయవిమర్శలో వంగూరి సుబ్బారావు గారు నాటకనవలాదులలో నెందఱో లేఖకులును ఇట్లాంధ్రభాష నలం కరించి పేరుగాంచి యున్నారు. ఇప్పటి సంఘసేవాపరులలోను సాహి త్యసేవకులలోను జాలమంది కాయన గురువు. 'స్థానే స్వశిష్యనివహే వి నియుజ్యమానా విద్యా గురుం హి గుణవత్తర మాతనోతి; మఱియు,సం ఘసేవను సాహిత్యసేవను సమన్వయించుటలోను, ఉత్సాహశక్తి కార్య దీక్షలలోను,గతానుగతికుఁడు కాక, ధీరుఁడై సంఘధోరణి కెదురీది తా నపవాదముపాలైనను దాను నమ్మినసత్యమార్గము వీడక వీరుఁడై సాధిం చుటలోను, ఆధునికాంధ్రులలో వీరేశలింగముగారితో సమాను లింక వరును లేరనియు, ఆంధ్రులలో నవ్యజీవితము గల్గుట కాయన చాలవఱకు కారకుఁడనియు, అంగీకరింపవలసి యున్నది.

# సర్వజ్ఞసింగభూపాలుఁడు.

## రత్నపాంచాలికానాటిక.

శ్రీ శ్రీ పీఠికాపురాధీశ్వరులచే విపుల మగుపీఠికతోడ నాంధ్ర లిపియందుఁ బ్రకటింపఁబడి పై నాటిక మా కార్యస్థానము నలంకరించినది.

పద్మనాయకకులప్రదీపకుండును, రావువంశజుఁడు నగుసర్వజ్ఞసింగభూపాలప్రణీత మైనకువలయావళి యనునామాంతరము గలరత్నపాంచాలికానాటిక యతిమనోజ్ఞమై సహృదయానందకరమై యున్న దనుటకుఁ బండితవిమర్శకాగ్రేసరులయభిప్రాయములే నిదర్శనములు. సింగభూపాలుఁడీగ్రంథము నేగాక యలంకారశాస్త్రగ్రంథ మగురసార్ణవసుధాకరమును, శార్ఙ్గదేవకృతసంగీతరత్నాకరమునకు సుధాకర మనువ్యాఖ్యానమును రచించి మించె నని తెలియుచున్నది. చమత్కారచంద్రికాకర్త యగువిశ్వేశ్వరకవి మొదలగుకవులు పెక్కు రీతనియాస్థానమున నుండిరి. ఈతనికీర్తి భోజవిక్రమార్కులకీర్తివలె దిగంతవిశ్రాంతమై యాంధ్రదేశమున వ్యాపించినది. శ్రీనాథమహాకవివరేణ్యుఁడును సింగభూపాలునియనుగ్రహము వడయుటకై శారదను బ్రార్థించె నఁట. అట్టి రాజశేఖరవిరచిత మగునీనాటిక ప్రాచీనకవు లగుకాళిదాస, హర్ష, భవభూత్యాదులరచనల ననుకరించుచు శృంగారరసప్రధానమై, సరసకవితావిలాసములచే నలరారుచున్న దనుట నిర్వివాదాంశము.

ఈనాటకము తిరువనంతపురగ్రంథావళియందుఁ బ్రకటిత మైనను దమసహజౌదార్యముతో ముద్రణసౌకర్యములు లేనియుద్ధసమయమున రావువంశాబ్ధిచంద్రులును భాషాభిమానులు నగు శ్రీ శ్రీ పీఠికాపురాధీశ్వరు లాంధ్రానువాదముతోఁ బ్రకటించియున్నారు. అంతియ కాదు. గ్రంథప్రాశస్త్యమునుగూర్చియు, సర్వజ్ఞసింగభూపాలునికవితామాధుర్యమును గూర్చియుఁ బెక్కు సంగతులను దమపీఠికయందుఁ దెలిపియున్నారు. మహాకవులగ్రంథరచనమునుగూర్చి నేఁడు ప్రచారమునఁ గలయైతిహ్యములను మనము సవిమర్శకముగఁ గైకొనవలయు ననియు, వాని సంధపరం

పరాన్యాయమునఁ జైకొనరా దనియు వీరిపీఠికాభాగము నొక్కి వక్కా-
ణించుచున్నది. పోతనామాత్యుఁడు తనయుత్కృష్టగ్రంథ మగుశ్రీమద్భా
గవతమును రచించి నరాంకిత మొనర్ప నిష్టములేక భగవదంకిత మొనర్చు
టను సహింపక, సింగభూపాలుఁ డాగ్రంథమును బలాత్కారముగఁ గైకొని
ఖనన మొనర్ప నందుఁ గొన్ని భాగములు నశించిన వనునపవాదము విశ్వస
నీయము కాదు. మహాకవియు, విద్వజ్జనపోషకుఁడును రసగ్రహణపారీణుఁ
డును నగుసింగభూపాలుఁ డిట్టియకార్యకరణ మొనర్చె ననుట నిరాధార
మును నతిసాహసము నై యున్నది. గ్రంథమున లుప్తభాగపూరణములకుఁ
గలకారణమునుగూర్చి యైతిహ్యముల నల్లవలయు ననుకొందరు. ఇట్టి
యపవాదములకు మూలము. మఱియు గ్రంథకర్తృత్వములనుగూర్చి ప్ర
చారమునఁ గలలోకప్రవాదములుగూడ నిట్టివే. హర్షకృతము లగురత్నా
వళ్యాదినాటకములు, కృష్ణరాయనియాముక్తమాల్యదయు నానామహా
రాజులయాస్థానములఁ గలకవులచే రచింపఁబడిన వనులోకప్రవాదములు
సత్యేతరములు. రసార్ణవసుధాకరమును విశ్వేశ్వరపండితుని కంటఁగట్టు
జనాపవాదము నట్టిదే. సింగభూపాలునియశశ్చంద్రికలకు మాలిన్య
మాపాదించునీయపవాదములను బహురీతుల విమర్శించి యవి యవిశ్వస
నీయము లని నిర్ధారణ మొనర్చిన శ్రీశ్రీపీఠికాపురాధీశ్వరుల కాంధ్రలోక
ము తనకృతజ్ఞతను దెలుపవలసియున్నది. విద్వల్లోక మీగ్రంథమును
సాదరముగఁ జదివి యానందించునుగాక.

పాఠకపరితోషమునకై రత్నపాంచాలికలోని శ్రీవారితొలిపలు
కును, గ్రంథముపైఁ బండితాభిప్రాయములును నిందుఁ బ్రకటింపఁబడినవి.

ప. సం.

# తొలిపలుకు.

సర్వజ్ఞసింగమహీపాలమౌళి పద్మనాయకకులప్రదీపకుఁడు. రావువంశరత్నాకరసుధాకరుఁడు. ఈ యసాధారణధీనిధి దిగంతవిశ్రాంతకీర్తిని గాంచెను. సర్వజ్ఞబిరుదాంకితుఁడై యసామాన్యప్రజ్ఞాశాలియై ప్రకాశించెను. ఉద్దండపండితాఖండలుఁడు. అలంకారతత్త్వవేత్త. అపారపాండితీపటిష్ఠుఁడు. అలంకారశాస్త్రము నామూలాగ్రముగ నెఱింగి యది చదువరులకు సువ్యక్త మగురీతి రచింప నేర్చిననేర్పరి. రసగ్రహణ పారీణుఁడై రసపోషణము విశేషశేముషీవిభవవిజృంభణముతో నొనర్చిన ధీనిధి. 'రసార్ణవసుధాకర' మనునలంకారగ్రంథమును, 'సంగీతసుధాకర' మనుసంగీతరత్నాకరవ్యాఖ్యానమును, 'రత్నపాంచాలిక' యనునాటకారత్నమును రచించి మించెను. సర్వజ్ఞసింగమహీపతి సుమనోమనోజ్ఞమైనకవితాప్రజ్ఞ కలిగి వెలిఁగెను. సంస్కృతనాటకకవిశిఖామణు లైన కాళిదాసశూద్రక భవభూతులకుఁ దీసిపోవువాఁడు కాఁడు.

పండితప్రవరుఁడును, మహాకవియు నైనశ్రీనాథకవిసార్వభౌముఁడనేకదేశములు దర్శించి బహుభంగుల గౌరవము లందినదిట్ట. చిరకాలమునుండి శ్రీనాథకవికృతము లని ప్రసిద్ధిఁజెందినయీక్రిందిపద్యముల వలన శ్రీనాథకవీంద్రునికేకాక లోకమునకుఁ గూడ సర్వజ్ఞసింగజనపాలమౌళియందుఁ గలగౌరవగరిమ విశద మగుచున్నది.

సీ. దీనారటంకాలఁ దీర్థమాడించితి
దక్షిణాధీశుముత్యాలశాల
పలుకుతోడై తాంధ్రభాషామహాకావ్య
నైషధగ్రంథసందర్భమునకుఁ
బగులఁగొట్టించి తుద్భటవివాదప్రౌఢి
గౌడడిండిమభట్టుకంచుఢక్క
చంద్రశేఖరుక్రియాశక్తి రాయలయొద్దఁ
బాదుకొల్పితి సార్వభౌమబిరుద

గీ. ఏటుల మెప్పించెదో నను నింకమీఁద
రావుసింగమహీపాలు ధీవిశాలు
నిండుకొలువున నెలకొనియుండి నీవు
సరససద్గుణనికురుంబ ! శారదాంబ !

క. సర్వజ్ఞ నామధేయము
శర్వునకే రావుసింగజనపాలునకే
యుర్విం జెల్లును నితరుని
సర్వజ్ఞం డనుట కుక్క సామజ మనుటే.

ఈసర్వజ్ఞసింగనృపాగ్రణిప్రజ్ఞావిభవ మత్యద్భుతమై శోభిల్లును. ఈకోవిదుని పాండితీప్రకర్షము పరమోత్కృష్టమైనదై ప్రకాశించుచున్నది. ఈకవివరేణ్యునకు వ్యాకరణము కరతలామలకము. అలంకారశాస్త్రమును గూలంకషముగ నెఱిఁగినమనీషి. నాటకశాస్త్రవేత్త. సంగీతకళాపారంగతుఁడు. ఈతనికవిత యసమానలసమానవిలాసమున వెలయు. శబ్దార్థాలంకారసంభరితము. మృదుమధురములైనపదముల పొందికచంద మందమైనది. "లలితకవితావిలాసచతురానన" యనునది నిజమైనదియు. రచన రసవత్తరము. రసము పొంగి పొరలుచుండును. ఈవిశేషవిషయము లీమహానీయునిరచన లగు 'రసార్ణవసుధాకరము' 'రత్నపాంచాలిక' మొద లగుగ్రంథములయందు సువిదితములు.'రసార్ణవసుధాకర' మత్యుత్తమమైనయలంకారశాస్త్రగ్రంథము. చిరకాలమునుండి వ్యాఖ్యాతృశిఖామణి యని యఖండఖ్యాతి వహించిన కోలాచలమల్లినాథసూరి సర్వజ్ఞసింగజనవరేణ్యునిఁ బ్రామాణికాగ్రగణ్యునిగ గ్రహించి గౌరవించి "రసార్ణవసుధాకరము"లోని శ్లోకములఁ బ్రమాణములుగాఁ దనవ్యాఖ్యానములలో లిఖించెను.

వర్తమానశతాబ్దమున గొప్పపండితులైనకళాప్రపూర్ణ వేదము వేంకటరాయశాస్త్రిగారు "రసార్ణవసుధాకర మత్యుత్తమమైనయలంకారశాస్త్రము. మహావిద్వాంసులు చదువుకొలఁదియలంకారగ్రంథములలో నొకటి" అని సెలవిచ్చిరి.

దీని శైలి సులలిత మైనది. మృదుమధురపదగుంఫితము. విషయము విస్ఫుటముగ వ్రాయఁబడినది. ఇందలిలక్ష్యములు స్వభావసిద్ధములై య త్యంతోచితము లైనవర్ణనములతో నొప్పి మహామనోహరముగ నున్నవి. "రత్నపాంచాలిక" యనునాటికకు నామాంతరము "కువలయావళి." ఇందలికథ కేవలము స్వకపోలకల్పితము. ఈకావ్యమునందలి కల్పన లన ల్పములై ప్రకాశించుచున్నవి. శైలి యకలంకమై ధారాశుద్ధి కలిగి వెలుఁ గొందుచుండును. కవిత సముచితచమత్కృతిసమంచితము. ఈకవిపుంగ వునిభావనాశక్తి స్తుతిపాత్రము. స్వభావసిద్ధము లైనవర్ణనలతో విలసిల్లు చుండును. మానవస్వభావము నీకవివరేణ్యుఁడు బాగుగ గుర్తెఱిఁగిన వాఁడు. రసపోషణమువిశేషచతురతతోఁ జేసెను. పాత్రౌచిత్య ముచితరీతిఁ బాటించె. సంభాషణము సమయోచితము. వేయేల? ఈకావ్యము ప్రపంచమునందలి మనుష్యప్రకృతికిఁ బ్రతిబింబమై ప్రకాశించుచున్నది. చదువరులయొక్కయుఁ జూపఱులయొక్కయు నుల్లముల నీకవితల్లజుఁడు రంజిల్లఁజేయును. ఇట్టిసుగుణమణిగణముతో విలసిల్లు రత్నపాంచాలికా నాటికారత్న ముత్తమోత్తమకావ్య మనుటకు సందియము లేదు.

'సంగీతసుధాకరము'— ఈయది శార్ఙ్గదేవవిరచిత మైనసంగీతరత్నా కరమునకు సర్వజ్ఞశేఖరులు విరచించిన మిగులఘన మైనవ్యాఖ్యానము. మూలమునకు వ్రాసినవ్యాఖ్యానములలో మన కింతవఱకు దొఱకినవాని లో 'సుధాకరమే' సుప్రశస్త మైనదఁట. ఈవ్యాఖ్యానములోనివిషయ వివరణముఁ జూడ నీగ్రంథకర్తకు వేదవాక్యములు ముఖస్థము లైనటుల విశద మగుచున్నది. ఈసుప్రసిద్ధగ్రంథముయొక్క వ్రాఁతప్రతులు బరో డా, బికనీరు సంస్థానములందు లభించె ననియు కాశ్మీరసంస్థానమునందుఁ గూడ నొకప్రతి యున్నటులు దెలియవచ్చినది. 'రత్నపాంచాలిక' 'రసా ర్ణవసుధాకరము' అనుగ్రంథములు తిరువాంకూరుసంస్థానమున దొఱ కినసంగతి మన మెఱుఁగుదుముగదా. దీనివలన మనము తెలిసికొనవలసిన దేమన సర్వజ్ఞశిఖామణిఖ్యాతి చాలకాలముక్రిందనే యాసేతుహిమా

చలము వ్యాపించి యున్న దనువిషయము. ఆహా ! యీ సాహితీసార్వభౌముని యప్రతిమానపాండిత్యప్రభాప్రభావము!

ఈసరణిని సర్వతోముఖమై దుష్యము కలిగి యప్రతిమానప్రతిభాభాసురుఁడై యసాధారణధారాశుద్ధితో శోభిల్లుశైలి కలిగి యలంకారశాస్త్రములలో శ్రేష్ఠముగ నెన్నఁబడుకృతికిఁ గర్తయై తదనుగుణముగ రసవంత మైనకవితాచాతుర్యముఁ జూపినవిద్వత్ప్రభువు "రత్నపాంచాలిక" యనుచిన్న రూపకమునుమాత్రము రచించి వేఱుకావ్యములు వ్రాయ కూరకుండునా? రసవత్తరము లగుసత్కావ్యము లనేకము లుదంచద్రీతి రచించి మించె ననియే నానమ్మకము. మొన్న మొన్నటివఱకు వెలువడక యుండిన 'కువలయావళి' వలెనే యితరకావ్యములు కూడ నెందేని మూలఁబడి యుండవచ్చును. అవి మనకు లభించుభాగ్యము భగవంతుఁ డెపుడు ప్రసాదించునో ?

విశ్వేశ్వరవిద్వద్వతంసుని చే రచింపఁబడిన 'చమత్కారచంద్రిక' యనునలంకారశాస్త్రమున సింగభూజానిగుణరత్నము లిట్లు వర్ణింపఁబడియె.

దాన దయా నయ వినయములు :

"దానేన కర్ణో దయయా దిలీపో
నయేన కావ్యో వినయేన రామః
యది ప్రసిద్ధిం దధతా మమీభిః
శ్రీసింగభూపో నిఖిలైః ప్రసిద్ధః."

"దానముచేఁ గర్ణుఁడు, దయచే దిలీపుఁడు, నీతిచే శుక్రుఁడు, వినయముచే శ్రీరాముఁడు, కీర్తినిదాల్చినవారు- పోఁగాక ! ఈ యన్నింటిచేతను శ్రీసింగభూపతి ప్రసిద్ధుఁడు.

సౌందర్యగరిమ :

"అవ్యాజసుందర మనిందితసత్త్వసార
మాజానుబాహు మరవిందదళాయతాక్షమ్
శ్రీసింగభూప మవలోకయతాం జనానా
మానందితాని నయనాని సుధాంబునేవ."

"సహజమైన సౌందర్యముకలవాఁడు, నిందింపఁబడని బలముదిగ్గు కల వాఁడు, ఆజానుబాహుఁడు, తామరపూరేకులవంటి పెద్ద కన్నులు గల వాఁడు నగు శ్రీ సింగభూపాలుని సందర్శించు జనుల నయనము లమృత రసము చేవలె నానందపెట్టఁబడును."

వాగ్వైదగ్ధ్యము :

"సౌగంధికే చ ఘనసారిణి చందనే చ
బింబాధరే చ సుదృశాం వదనే చ తాసాం
శ్రీసింగభూపరచితే చ గిరాం కదంబే
కో వా న నందతి జనో జగదేకసారే."

"సౌగంధికపుష్పమందును, కర్పూరమందును, చందనమునందును, సుదృశల బింబాధరములందును, వారలమోములందును, శ్రీ సింగభూపాల రచితములై జగదేకసారము లగువాక్యముల కదంబమునందును, ఏజనుఁడు ఆనందమును పొందఁడు ?

శౌర్యసంపద :

"గర్జద్ఘూర్జరగర్వపర్వతభిదే నేపాలభూపాలక
ధ్వాంతధ్వాంతవిరోధినే కటురటత్సౌరాష్ట్రరాష్ట్రద్రుహే
దృప్యత్కేరళమౌళిమోటనకృతే శ్రీసింగపృథ్వీపతే
భూయాసు ర్భువనాభయవ్రతభృతే శ్రేయాంసి భూయాంసి తే."

"గర్జించుఘూర్జరుల గర్వము లనుపర్వతములను భేదించువాఁడవును, నేపాళరాజు లను చీకట్లకు సూర్యుఁడవును, కటువుగా సందడించు కేరళుల తలలపై మొట్టువాఁడవును, లోకములకు నభయ మిచ్చుదీక్ష పూనినవాఁడవును నగు నీకు బహుశ్రేయస్సులు కల్గుఁ గాక !

కొందఱు కిట్టనివా రిట్టివిద్వద్వంద్యుఁ డగుసింగభూమీశునిపై దోషారోపణముఁ జేసిరి. "బమ్మెరపోతనామాత్యకృత మైనభాగవతము సింగభూపతి తన కంకిత మీయఁ గోరెను. దానికిఁ బోతన సమ్మతింప లేదు. అందుపై నాప్రభుపు కోపోద్దీపితుఁడై యాగ్రంథమును బాతి పెట్టించెను. అందువలనఁ గొన్ని భాగములు క్రిమిదష్టములై నశించెను.

తరువాతఁ గొంతకాలమునకు నాపుస్తకము బైటఁ బడినపు డితరు లా శిథిలభాగములను బూరించిరి.'' ఇట్టిలేనిపోనియపవాదము మోపిరి. ఈ నింద హేతురహిత మైనది. పోతనామాత్యుఁడు భోగినీదండకము విరచించి సింగభూపతికిఁ గృతియిచ్చె నందురుగదా? ఇటులఁ బ్రభునియభిమతముప్రకారము ప్రవర్తించినయాతఁడు భాగవతమును సింగనృపతికిఁ గృతి నీయకుండునా ? అంతటిధీశాలియు నఖండపండితుఁడు నలంకారతత్త్వవేత్తయు భక్తశిఖామణియుఁగవిశిరోమణియు నైనమహానుభావుఁడు బమ్మెరపోతనామాత్యవిరచితమై భక్తిరసపూరితమైయొప్పుభాగవతమును బాఁతిపెట్టించుట యనుపాపపుఁబనికి నొడికట్టుకొనునా ? పరోపకారము కొఱకేగదా మిగుల శ్రమగొని 'రసార్ణవసుధాకరము,' 'సంగీతసుధాకరము,' 'రత్నపాంచాలిక' మొదలగునుద్గ్రంథముల రచించెను. అట్టి మహాకవి కీపా ట్లేల ? కృతిభర్త యగుటకంటెఁ గృతికర్తయగుట ఘనతరము కదా ? అది యటుండనిండు.

ఇంతకును నీభాగవతమునకుఁ బ్రతి యొక్కటే యుండునా ? అంతటి కవివరేణ్యుఁడు రచించినయుత్తమగ్రంథమునకు నొక్కటే ప్రతి యుండెనా ? మఱియు నీభాగవతభాగములను బూరించినశిష్యులు కొందఱు కలరుగదా ? వీ రీవిషయ మెందేనిఁ బొందుపఱిచిరా ? శిష్యులింద ఱుండినను గ్రంథమునకుఁ బ్రత్యంతరము లేకుండునా? లే దందముగాక! దీనికి మూల మైనవ్యాసరచితసంస్కృతభాగవత ముండెనుగదా ? కవివరుఁడగు పోతరా జుండెనుగదా ? ఆతనికిఁ గవితారచన యన మంచి నీరు ద్రాగుటయేకదా ? ఆయన తిరిగి వ్రాసికొనలేకపోయెనా ? మరల వ్రాయ లేఁడని యనుకొనునంతటియజ్ఞానియా? సర్వజ్ఞుఁడు పోతనభాగవతమును బఠించి యానందించి కృతార్థులగుభాగ్యమును లోకులకు లేకుండఁ జేయునా ?

ఇఁక నొకసంగతి. కవికిఁగాని యితరులకుఁగాని లభింపకుండునట్లు చేయఁదలంచినఁ దలంపవచ్చునుగాని యీరసజ్ఞుఁడు తాఁజదివి యానంద మొందఁ దలంచియైన రహస్యముగఁ దనకడ నిడుకొన కుండునా ? అది

యును గాదందముగాక! ఎవరికిని లభింపకుండునటుల నీభాగవతమును దగులఁబెట్టించునుగాని యప్పుడో లేక మఱెప్పుడో యితరులకు దొరకునటులఁ బాఁతిపెట్టించునా? అఖండపండితుఁడై కవిశేఖరశిఖామణియైనయీయశోవిశాలునకుఁ బోతనభాగవత మంకిత మీయనంతమాత్రమున లోటు వాటిల్లె నని యాతఁడెంచినట్లు మనము దలంచుట యుచితము గాదు. ఇంతకు సర్వజ్ఞుఁడును బోతనయు సమకాలికులే కా రని యొకవాదము కలదు. అట్లగుచో నేబాధయు లేదు.

మఱియొకవాద మింక వివరించెద. అది యేది యన: పోతనామాత్యుఁడు భాగవతమునందలిరసవత్తరము లైనభాగములనుమాత్రమే విరచించి, శేషించినవానిని దనశిష్యులు వ్రాయుటకై వదలెను. అవి యాతీరున నిర్మితము లయ్యె. కావునఁ బ్రథమమున నవన్నియు నేరీతి రచింపఁబడెనో యాతీరుననే సరిగ మనకు లభించి, నేఁడుకూడ మనకడ సంపూర్ణముగ నున్నవి. అప్పుడు శిథిల మనుమాట కిసుమంతయు నవకాశ ముండదు. ఈవాదము సహేతుకమై సంతృప్తికరముగ నున్నది.

ఒకవిశేషవిషయ మింకఁ గలదు. ఇతరులచేఁ బూరింపఁబడిన భాగములు స్కంధాదితోఁ బ్రారంభమై స్కంధాంతముతో ముగియును. నారయ, సింగన, గంగన, యనుముగ్గురుకవు లీవఱువుననే వ్రాసిరి. దీని వలనఁ దెలియున దే మన? ఏ రెవరిమట్టునకు వారు వారివారికథలను సంపూర్ణముగ వ్రాసికొని రనియు శిథిల మైనవానిని బూరించుట కా దనియు ననునంశము. రెండుస్థలములయందుమాత్రము కొన్నిపద్యములు నారయ రచించినటులఁ గొన్ని ప్రతులలో నున్నది. దీనికిఁ దృప్తికరము లైనకారణములు గానరావు. శైలిలో నొకింతభేద ముండవచ్చును. అంత మాత్రమున రచన పోతనది కా దనఁ దగదు. పోతనకవిత యని యెల్లరిచే నెన్నఁబడుకొన్నిస్థలముల శైలిలో భేదము కలదు. అనేకు లగుకవిపుంగవుల గ్రంథములలోఁ గూడ నీరీతియే కాననగు. నారయ,సింగన,గంగనలు తాము వ్రాసినగ్రంథములలోఁ దమయభిధానంబులఁ బొందుపఱిచియున్నారు. ద్వితీయదశమస్కంధభాగముల నితరకవులపేరులు కానరావు.

పోతనామాత్యునిపవిత్రనామమే కాననగును. దీనిని నమ్మకుండుటకును, రెండవవాదమును విశ్వసించుటకును దగినహేతువు లగపడవు. కావున నీభాగములుగూడఁ బోతనార్యవిరచితము లనియే యెంచనగును. భాగవత మంతయు బాగుగఁ బరిశీలించినచో నీవిషయము విశద మగును. ఈవాదమే మనమన్ననకుఁ దగియున్న దని నానమ్మకము.

నారయ, సింగన, గంగన లనుముప్వురుకవులలో నెవ్వరు నిటుల భాగవతభాగములు శిథిలము లైన వనుమాటనే యెత్తుకొనలేదు. పోతనార్యునిప్రియశిష్యుఁ డైననారయయైనను దీనిని బేర్కొనలేదు. ఈకింవదంతి వాస్తవ మైనచో నీప్రియశిష్యుఁ డైన నుడివియుండఁడా? ఇది ముఖ్యమైనవిషయము. ఇంతియే కాదు. పోతనమహాకవిసమకాలికు లైనకవు లొక్కరైనను దీనిని వాకొనలేదు. కవివరు లైనపోతనపుత్త్రాది బంధువు లెవ్వరునుగూడ నీవిషయము నెచ్చటను దెలుపరైరి. అటు పిమ్మటఁ గూచిమంచి తిమ్మకవికాలమువఱకు వెలసినవిద్వాంసులగ్రంథములలో నెందును నీపరివాదము కానరాదు. ఏకారణముననో తిమ్మకవి మాత్ర మటుల లిఖించెను. తిమ్మకవి తన కత్యంతాభిమానము గలయభిప్రాయమున కనుకూలముగ నున్న దని రచించె నని తోఁచుచున్నది. ౧౯౧౬ సం॥ ప్రాంతములయందు జీవించినవారును సుప్రసిద్ధపరిశోధకులు నైన కందుకూరి వీరేశలింగముపంతులుగారు, గురుజాడ శ్రీరామమూర్తిపంతులుగారు వ్రాసిన 'ఆంధ్రకవులచరిత్రము' నందును 'కవిజీవితముల' యందును నీయంశమును బాగుగఁ బరిశీలించి యీప్రవాద మసమంజస మైన దని వ్రాసియుండిరి.

ఇఁక నొకయసందర్భము చూపట్టుచున్నది. అ దేది యందురా? ముద్రితము లైనభాగవతగ్రంథములపీఠికలలో రాజుల నిందించుపద్యములఁ గొన్నిటిఁ బోతనకృతములుగా నుదాహరించియున్నారు. పరిశీలింప నివి పోతనరచితములు కా వనియుఁ బోతనకుఁ బూర్వు లగుకవులచే రచింపఁబడినగ్రంథములయం దీపద్యములు చూపట్టుచున్న వనియుఁ

బండితులు నుడువుచున్నారు. ఈరీతిని బరులపద్యములఁ బోతనకృతము లుగాఁ బ్రకటించుట యన్యాయముకాదా ?

రత్నపాంచాలికానాటికయందు సర్వజ్ఞులీక్రిందిశ్లోకమును వ్రాసి యున్నారు.

"కళ్యాణమస్తు జగతాం సతతం త్రయాణాం
సంవర్ధితో భవతు వైదికఏవ మార్గః
సారస్వతాని సరసాని కవీశ్వరాణాం
మాత్సర్యదిగ్ధహృదయా న కలంకయంతు."

"ముల్లోకముల కెప్పుడు కల్యాణమౌఁగాక! వైదికమార్గమే వృద్ధిపొందింపఁబడుఁగాక! కవీశ్వరుల సరసములగు సారస్వతములఁ గూర్చి మాత్సర్యమున మున్గినహృదయములుకలవారు కలంకములు పల్కకుందురుగాక!"*

ఈరీతిగా నీతివాక్యము తనకావ్యమున లిఖించి దీనికి వ్యతిరేకముగఁ బ్రవర్తించునా? అటులు చేసినచో నలుగురిలో నగుఁబాటగును గదా. తాను లోకాతీతప్రజ్ఞాశాలియు సర్వజ్ఞబిరుదాంకితుఁడును విద్వద్వతంసము నయ్యు వేఱొకశాస్త్రవేత్త వ్రాసినగ్రంథమునందు గౌరవము గనఁబఱచుచుఁ బరోపకారసంపన్నులై ఘనవ్యాఖ్యానము లిఖించిన వినయనయశీలసంపన్నులైనసింగనృపశిరోమణి మహాకవివరేణ్యుఁడు, భక్తాగ్రగణ్యుఁడు నత్యంతపూతచరితుఁడు నైనపోతనామాత్యునిగాని, యాతఁడపమానలసమానశైలిని రసవత్తమముగను భక్తిరసపూరితముగను రచించిన భాగవతగ్రంథరత్నమునుగాని నిరసించి యవమానించె ననుట యెంతమాత్రము సమంజసముగాదు.

ఈకారణములంబట్టి చూడ నీయపవాద మన్యాయ్యమైనదనియు నసంగత మనియు విదిత మగుచున్నది. కిట్టనివారు పుట్టించినయీయపవ

---

* ఇందలి శ్లోకముల క్రింది యాంధ్రానువాదము శ్రీ శ్రీ ఉయ్యూరురాజా వారిచే వ్రాయఁబడినది.

నింద పట్టిబూటకము. విశ్వసింపఁదగినది కాదని విజ్ఞులకు వేఱె విజ్ఞప్తి చేయుట యనవసరము. అశేష శేముషీవిభవాభిశోభితుఁడై నసర్వజ్ఞ సింగభూభుజుఁడు సర్వజ్ఞవరేణ్యుఁడై కవిశిఖామణియై యాలంకారిక చక్రవర్తియై విద్వద్వతంసుఁడై వంద్యుఁ డయ్యెను. వైయాకరణశిరోమణియై ప్రసిద్ధి గాంచెను. నాట్యకళాకోవిదుఁడై పొగ డొందెను. సంగీత శాస్త్రపారంగతుఁడై భాసిల్లెను. ఆహా! ఈ మహామహునిమహిమాతిశయము? ఇట్టివారు వేఱెరీ? అతని కాతఁడే సాటి.

విద్వద్వంద్యులు పరమపూజ్యులు మహాప్రాజ్ఞులు నైనసర్వజ్ఞ సింగకవిసార్వభౌమా! నద్భక్తిపూర్వకముగ నేను సమర్పించుసాష్టాంగ నమస్కారసహస్రముల స్వీకరింపుఁడు!

సత్యాభిమాని,

రావు వేంకటకుమారమహిపతిసూర్యారావు,

పిఠాపురమహారాజు.

# పండితాభిప్రాయములు.

శ్రీశ్రీశ్రీ సర్వజ్ఞసింగభూపాల విరచితమగు "కువలయావళి" యనునాటికను జదివితిని. దీనికి 'రత్నపాంచాలిక' యను నామాంతరము కలదు. ఈనామ మీగ్రంథమందుఁ దుదిని ముద్రింపఁబడినశ్లోకమూలమున వాడుకలోనికి వచ్చెను. దృశ్యకావ్యములలో నీశ్లోకముండుట కనర్హమగుటచే నాటికాబహిర్భూత మనకతీరదు. గ్రంథకర్తృసమ్మతము 'కువలయావళి' యను నామమే. గ్రంథకర్తకు 'సర్వజ్ఞ'యని యన్వర్థబిరుదము కలదు. ఈకవిప్రవరుని నచ్చటచ్చట సర్వజ్ఞపదము లేకయే కవులునిర్దేశించుటచే నిది బిరుదమని చెప్పకతప్పదు. ఆకాలపు విద్వాంసులీబిరుదము నుపాయనము చేసిరని నిశ్చయింపవచ్చును. వీరియెడ నీబిరుదము శ్రీశ్రీశ్రీ పీఠికాపురాధీశులైన శ్రీరావు వెంకటకుమారమహీపతి సూర్యారావు మహారాజులుంగారు వ్రాసిన 'తొలిపలుకు' లో నిరూపింపఁబడియున్నది. వీరిఁగూర్చి వైయాకరణశిరోమణిపదము తొలిపలుకులోఁ గాన్పించుచున్నది. అమరుఁడు నందనపదము పుంలింగముగ నేయుండు నని చెప్పియున్నను దానిని త్రోసిపుచ్చి పాతంజలమహాభాష్యాదిపర్యాలోచనచే స్త్రీలింగముకూడ సాధువే యనిగ్రహించి 'విదర్భరాజనందనా'యని ప్రయోగించుట యీకవితల్లజునివ్యాకరణజ్ఞానము నిరూఢమని వైయాకరణులు గ్రహింపకపోరు. ఈ గ్రంథమందలి శైలినిబట్టియు నిందలియితివృత్తము కల్పితమైనను, ఔచిత్యభంగము కలుగకుండ నౌచిత్యమును పాటించి రచించుటనుబట్టియు నీ రీనాటికను కవితాపరిణతిదశలో వ్రాసిరని గ్రహింపవచ్చును. ఔచిత్యరక్షణకై తత్తత్పాత్రముల వాక్యములు ప్రాకృతభాషలో నుండునని నిశ్చయింపక తీరదు. ప్రాకృతభాషలోఁ బ్రకటింపఁబడినప్పుడే సహృదయు లిందలి యౌచిత్యమును బూర్తిగా గ్రహింపఁగలరు. కావున శ్రీశ్రీశ్రీ పిఠాపురాధీశ్వరులు ప్రాకృతభాషలోఁ జేర్చి యీనాటికను బ్రకటించి గ్రంథకర్తృగౌరవమును నితోధికముగా లోకవ్యాప్తమగునటులఁ జేయించెదరని నమ్ముచున్నాను భాషాసేవమూలమున లోకోపకారమునందు బద్ధకంకణులైన

పీఠాపురాధీశ్వరులైన శ్రీరావు వెంకటకుమారమహీపతి సూర్యారావు మహారాజులుంగారిని చిరాయురారోగ్యముల నిచ్చి భగవంతుఁడు రక్షించుఁగాత మని ప్రార్థించుచున్నాను.

మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ,
తాతా సుబ్బారాయశాస్త్రి.

శ్రీ శ్రీ పీఠికాపుర మహారాజావారి యాజ్ఞానుసారము ప్రచురింపఁబడిన యాంధ్రానువాదసహితరత్నపాంచాలిక యను నాటికను నామూలాగ్రముగాఁ జదివితిని. నాటికరసవంతమై శ్రీహర్ష రాజశేఖరుల నాటికలను బోలియున్నది. శ్రీ మహారాజావారితొలిపలుకును సావధానముగాఁ జదివితిని. అందు రత్నపాంచాలిక నాటిక గుణవిశేషములును, తత్కర్త గుణాతిశయములును సమగ్రముగాఁ బొందుపఱుపఁబడియున్నవి. కృతిబహులకర్తయగు సింగభూపాలుఁడు కృత్యంతరభర్త కాలేకపోతి మనుకోపమున యాకృతిని నాశముఁజేయఁ బ్రయత్నించె ననునపప్రథను బరిశీలించి యది యసమంజసమని సోపపత్తికముగా శ్రీ మహారాజావారు నిరూపించి సత్యమును బయలుపుచ్చినందుకు ఆంధ్రలోకమంతయును వారికిఁ గృతజ్ఞులై యుండఁదగినది శ్రీ మహారాజావారి విద్వన్నుతమైన పీఠిక సింగభూపాలుని రసార్ణవసుధాకరాద్యనేక గ్రంథకర్తృత్వ విషయమున సందేహా మేమైనయున్నఁ బోఁబూర్తిగాఁ దొలఁగించుచున్నది. సింగభూపాలుని రసవంతమగు కృత్యంతరములను మనకు నచిరకాలములో లంభింపఁజేయుఁగాక యని భగవంతుని శ్రీ మహారాజావారితోపాటు నేనును బ్రార్థించుచున్నాను.

పరవస్తు వెంకటరామానుజస్వామి, ఎం. ఏ.

తన సర్వతోముఖపాండిత్యవైదగ్ధ్యగరిమచేత సకల విద్వజ్జనసమ్మతముగా సర్వజ్ఞపదలాంఛనుఁడై, శ్రీరావు వంశాబ్ధి రాకాసుధాకరుఁడై, సకలాంధ్రజాత్యభిమానగౌరవాస్పదుఁడై 15 వ శతాబ్దమందు

వెలసిన సింగభూపాలవరేణ్యుఁడు గీర్వాణభాషలో రచించిన 'రత్నపాంచాలిక'యను నాటికను దద్రాజ్యకులదీపకులయిన శ్రీ పీఠికాపురమహారాజులు శ్రీశ్రీ రావు వేంకటకుమార మహీపతి సూర్యరాయ బహద్దరువారు ప్రకటించి సుప్రసిద్ధమైయున్న తమ విద్యాసాహిత్యపోషణమునకును, నిరంతరసారస్వతసేవకును ననుగుణముగా నీ నాటిక నాంధ్రుల కందఁజేసి మఱియొకసారి యాంధ్రుల కృతజ్ఞతకుఁ బాత్రులయినారు.

ఈ నాటికకుఁ బీఠికగా శ్రీవారు రచించిన 'తొలిపలుకు'నం దాసర్వజ్ఞుని యఖండశేముషీవైదుష్యవిశేషములను సరసకవితాకౌశలమును విశదీకరించువిషయములు గలవు. అంతేకాక, యందు శ్రీవారు మఱియొక ముఖ్యవిషయమును సంపూర్ణముగాను, అప్రత్యాఖ్యేయముగాను విమర్శించి యాథార్థ్యమును బ్రతిపాదించినారు. సింగభూపాలుఁడు బమ్మెర పోతన రచించిన భాగవతమునకుఁ గృతిభర్త గాఁగోరినట్లును, దానికిఁ బోతన సమ్మతింపకపోవుటచేత నాభూపాలుఁడు కోపోద్దీపితుఁడై యాగ్రంథమును భూమిలోఁ బాఁతిపెట్టించినట్లును, అందుచేత గ్రంథమందలి భాగములు కొన్ని కృమిదష్టములై పోయినట్లును, బిమ్మట మఱికొంతకాలమునకు నాగ్రంథము బయలుపడఁగా శిథిలములైన భాగములను బోతన శిష్యులయిన నారయ సింగన గంగనలు పూర్తిగావించినట్లును బ్రవాద మొకటి బమ్మెర పోతన తర్వాత మఱిమున్నూఱుసంవత్సరములకు గోదావరీతీరమందలి కూచిమంచి తిమ్మకవి వలనఁ బుట్టినది. ఇది నిరాధారమైన ప్రవాదమని యాంధ్రవాఙ్మయచరిత్ర పరిశోధకులయిన కందుకూరి వీరేశలింగముపంతులుగారు, గురుజాడ శ్రీరామమూర్తిపంతులుగారు మొదలయిన పండితులు తమ నిశ్చితాభిప్రాయమును స్పష్టముగాఁ దెలియఁజేసినారు. అప్పటికిని నిరాధారమైన యీ విపరీతపరీవాదమును వివేకములేక విశ్వసించినవారు కొందఱు తమ రచనలలో దీనిని వాస్తవమైన చరిత్రాంశముగా గ్రహించుట మిక్కిలి శోచనీయము.

చరిత్రాంశములను గొంచెముగా మార్చి వాస్తవములు కాక పోయినను లోకమం దనుశ్రుతములుగా నున్నప్రవాదములను దమరచనలకును గథాకల్పనలకును గావలసినట్లు గ్రహించుట కవుల కాచారమై యున్న దన్నమాట సత్యమేకాని, యందేవి సాధకములో యేవి బాధకములో విచారింపఁగల సదసద్వివేక ముండవలెను. దాని కొక నిదర్శనము: రామదా సనుపేరు పొందిన కంచెర్ల గోపన్నకై యాలుల కొలధనమపహరించె ననునేరముమోపి తానీషా యతనిని గారాగృహస్థుని జేయఁగా నతఁ డందే మరణించె నని చరిత్రలో నున్న విషయము; శ్రీరామునియనుగ్రహామువలన గోపన బుణవిముక్తుఁడును గారాగృహవిముక్తుఁడును, అయిన ట్లనుశ్రుతముగా వచ్చినప్రవాదము. రామదాస భక్తిప్రభావమున కనుకూలముగాను, గథాకల్పనకు సాధకముగాను నున్నది గనుక యిట్టిప్రవాదము గ్రహించుట యుక్తమే; కాని, సర్వజ్ఞభూపాలుని సద్గుణసంపత్తికిఁ బ్రతికూలముగాను, అతని సద్యశమునకు బాధకముగాను నిరాధారమైన పరీవాదమును గ్రహించుటమాత్రము సమంజసము కాదు. సింగభూపాలుఁడు సర్వథా సద్గుణసంపన్నుఁ డనుటకు విశ్వేశ్వరవిద్వద్వతంసుఁడు రచించిన చమత్కారచంద్రిక యను నలంకారశాస్త్రగ్రంథమందలి "దానేన కర్ణో దయయా దిలీపో నయేన కావ్యో వినయేన రామః, యది ప్రసిద్ధిం దధతా మమీభిః శ్రీ సింగభూపో నిఖిలైః ప్రసిద్ధః" అను శ్లోకము ప్రబలమైనప్రమాణము. "సారస్వతాని సరసాని కవీశ్వరాణాం మాత్సర్యదిగ్ధహృదయా న కలంకయంతు" (చూ. రత్నపాంచాలికా. అం. ౧. కడపటిశ్లోకము.) అని చెప్పిన సింగభూపాలున కిట్టి విపరీతమాత్సర్య మంటఁ గట్టుట ధర్మము కాదు. పైనిఁ జెప్పినప్రవాదము సింగభూపాలునిశీలమునకు విరుద్ధమైనది గనుక గ్రాహ్యము కాదు.

ఇట్టి యసమంజస మైనపరీవాదమును ఖండించుటకై (శ్రీ) వారు సరి యైనయుపపత్తులతోఁ గావించినవిమర్శనము సర్వథా సమంజస మైనదిగ వివేకు లందఱును గ్రహింతు రని నానమ్మకము.

'రత్నపాంచాలికా నామ నాటికా రసపేటికా' అని గ్రంథము చివఱ నున్న వాక్యము యథార్థమైనది. సింగభూపాలుఁడు శ్రీ వారు చెప్పినట్లు సుమనోమనోజ్ఞమైనకవితాప్రజ్ఞ కలిగి వెలింగెను. సంస్కృత నాటకకవిశిఖామణులైన కాళిదాస శూద్రక భవభూతులకుఁ దీసిపోవు వాఁడు కాఁడు. కవిసార్వభౌముఁ డను బిరుదుపొందినశ్రీనాథుఁడు చెప్పిన "దీనారటంకాల-సర్వజ్ఞనామధేయము" మొదలైనపద్యములను బట్టియే యింతవఱకును సింగభూపాలుఁడు సర్వజ్ఞుఁడై యుండవలె ననుకొంటిమి. ఇప్పు డాసర్వజ్ఞుఁడు రచించిన 'రసార్ణవసుధాకర' మనునలంకారగ్రంథమును శార్ఙ్గదేవకృతసంగీతరత్నాకరమునకు ఘనవ్యాఖ్యాన మగు 'సుధాకర' మనుగ్రంథమును 'రత్నపాంచాలిక' అను నాటికారత్నమును జదివి విన్నదియథార్థ మని స్వయముగాఁ దెలిసికొనుట కవకాశముగలిగినది.

ఈనాటికమాత్రమే కాక తక్కినరెండుగ్రంథములును నాంధ్రానువాదములతో శ్రీవారు ప్రకటింతురుగాక.

గిడుగు వేంకటసీతాపతి.

సరససారస్వతసముద్ధరణచణులగు శ్రీ శ్రీ శ్రీ పీఠికాపుర సంస్థానాధీశ్వరులు ప్రచురింపించి యాదరమేదుర మగుసౌహార్దముతో నాకనిపిన 'రత్నపాంచాలిక'ను కృతజ్ఞతాభివందనములతో నందుకొని యానందముతో నామూలాగ్రముగఁ జదివితిని. 'కువలయావళి'యను నామాంతరముగల యీనాటిక శ్రీ రావువంశ రత్నాకరసుధాకరుఁడును, సాహిత్యవిద్యాపారంగతుఁడును, సంగీతకళావిశారదుఁడును, 'రసార్ణవసుధాకరాది మహోత్కృష్టగ్రంథ రాజముల రచించి, 'సర్వజ్ఞ' బిరుదాంచితుఁడగు తన యశశ్చంద్రికల దిగంతముల నలంకరించి మించిన కవిశేఖరుఁడు నయిన శ్రీ సింగభూపాలుని కృతిరత్నములలో నొకటి.

'జగమెఱిఁగిన బ్రాహ్మణునకు జందెం బేలా' యన్నట్లు కవిరాజసార్వభౌముఁడైన శ్రీనాథునంతవానికి వెఱపు గల్గించు నసాధారణపాండితీ వైభవముతో నొప్పారి విశ్వేశ్వరాదివిద్వత్ప్రకాండ శ్లాఘ్య

మానసరససాహిత్యసౌభాగ్యధురంధరుఁ డగునశ్రీ సింగభూకాంతుని కవితావిశేషములను బ్రశంసింప నెంచుట నుముబోంట్లకు సముద్రమున కేతా మెత్తఁ దలంచుటయె.

ఈ కువలయావళి కథాసంవిధానమున (శ్రీ) హర్ష దేవకృతమగు 'రత్నావళి' నొకింత పోలియున్నను, ఇందలి కల్పనాకౌశలము, రసభావపోషణము, చరిత్రచిత్రణము, ఔచితీనిర్వహణము ననన్యాదృశములు. అభిజ్ఞానశాకుంతలంబునవలె నిం దందందుఁగల శ్లిష్టవచన చమత్కృతి కడుహృద్యము. రచనావిశేషము కళాపూర్ణోదయమునందలి యీక్రింది ప్రశంసకు నెంతయుఁ దగియున్నదనవచ్చును.

చలువగల వెన్నెలల చెలువునకు సౌరభము గలిగినను సౌరభముఁ జలువయుఁ దలిర్పం, బాలుపెసఁగు కప్పురపుఁబలుకులకుఁ గోమలత నెలకొనిన సౌరభముఁ జలువపసయుం, గోమలతయును గలిగి జనముల మిగులఁ బెంపెసఁగు మలయపవనంపుఁగొదమలకు మధురత్వం,బలవడిన నీడు మఱి కల దనఁగవచ్చుఁ గడువెలయఁగల యీసుకవిపలుకు లకు నెంచన్.

ఈకవిరాజశిఖామణి పాండిత్యప్రకర్షము, కవితావైభవము, సద్గుణసంపద మున్నగువిషయములంగూర్చి శ్రీశ్రీశ్రీ పీఠికాపుర మహారాజశిఖామణులు తమ 'తొలిపలుకు'లో సంగ్రహరూపమున సముచితముగఁ బ్రశంసించియున్నారు.

సకలకలావిశారదుఁడును, సరసకవితాధురంధరుఁడును, సత్కవిపండితసమాదరణశీలుఁడును, సుగుణాలవాలుఁడును, సర్వజనసంస్తుతిపాత్రుఁడును, స్వకీయవంశకర్తయు నగు సర్వజ్ఞసింగమహీభర్తపై నజ్ఞలోక మన్యాయముగ వైచిన నిరపరాధనిందాపంకమును శ్రీవారు తమ యనర్గళనిర్గళ ద్వచోధారలచే నిశ్శేషముగఁ గడిగివైచిరి. ఈసందర్భమున శ్రీమహారాజులవా రుపపాదించిన హేతువాద మత్యంతశ్లాఘాపాత్రము; అప్రత్యాఖ్యేయము; అనన్యసులభము. శ్రీవా రాయుపదూఱును

బాపుటకై చూపిన యుపపత్తులలో నొక్కటొకటియు సత్యసంబద్ధము, అప్రతివచనీయము నగుట యథార్థకథనము.

భాస్కరుఁడు తాను దెనిఁగింపఁ బూనిన రామాయణమునఁ గొన్ని భాగములు తనపుత్త్రునిచేతను, మిత్త్రునిచేతను, ఛాత్త్రునిచేతను రచియింపించె నసుట యాంధ్రలోకమున కవిదితము కాదుగదా. అట్లే పోత నామాత్యుఁడును నారయాదులచేఁ గొన్నిఘట్టములు రచింపించి యుండుట యసంభావ్యముగాదు. మఱియు సర్వజ్ఞునిపై నీయపప్రథ పోతన సమకాలికులెఱుంగరు. అనంతరకాలికులకుఁ దెలిసియున్నట్టును దోఁపదు. అర్వాచీనుఁడగు తిమ్మకవి కెట్లు తెలియవచ్చినది ? నిరక్షరకుక్షులు చెప్పు కొను పుక్కిటిపురాణములనుబట్టి, ఆవట్టిమాటలను బట్టి యీమహారాజ కవి కట్టికలంకము నంటఁగట్టుట మహాపరాధమని చెప్పకతప్పదు. శ్రీపీఠి కాపురసంస్థానాధిపతుల యుపోద్ఘాతమును జదివినవెనుక నెవ్వరు నట్టి కింవదంతిని విశ్వసింపఁ బోరని నానమ్మకము. నిత్యసత్యాభిమానులును నిరంతరసారస్వతాభిలాషులు నగు శ్రీశ్రీశ్రీ పీఠికాపురాధీశ్వరులకు సర్వేశ్వరుఁ డాయురారోగ్యైశ్వర్యాభివృద్ధు లొసంగి సర్వదా రక్షించుఁ గాత !

సత్యం జ్ఞాన మనంతం య జ్జగజ్జన్మాదికారణమ్ ।
శ్రేయసే భూయసే స్యాత్త త్సూర్యారాయమహీభృతః ॥

ప్రయాగ వేంకటరామశాస్త్రి.

---

శృంగారరసపేటికయగు నీరత్నపాంచాలికానాటికకృతిప్రణేత శ్రీ సర్వజ్ఞసింగభూనేత, రసార్ణవసుధాకర సంగీతసుధాకరాది మహోద్గ్రంథ ముల రచియించి, వ్యాఖ్యాతృచక్రవర్తి మల్లినాథసూరికిఁ బ్రామాణికుఁ డైన మహావిద్వాంసుఁడు. సంస్కృతభారతియందు వెలయు నీనాటిక కొఱకు గవేషణము సేయించి, యతిమధురమగు నాంధ్రమున దీని నను వదింపఁజేసి, యాంధ్రవిద్వల్లోకమునకు నొసంగిన శ్రీ పీఠికాపురమహా

రాజేంద్రులకు నాంధ్రమహాజను లందఱుఁ గృతజ్ఞతాపూర్వకముగఁ బ్రశంసాసూక్తిమంజరి నర్పించుచున్నారు.

చక్కని దేవాలయమును స్వర్ణశిఖరముతో నలంకరించునట్లు శ్రీ పీఠికాపురాధీశ్వరు లీనాటిక నలంకరించినపీఠిక సహృదయహృదయంగమమై యలరారుచున్నది. పరమభక్తాగ్రేసరుఁ డగుబమ్మెరపోతన భాగవతమును వ్యాప్తము గాకుండ నీసింగభూపతి ఖలమొనరించె నను పరంపరాయాతమగు లోకాపవాదమును నీమహారాజేంద్రులు సయుక్తికముగ, సప్రమాణముగ, శాస్త్రీయముగ విమర్శించి శ్రీ సింగభూపాలచంద్రుని నిష్కళంకునిగాఁ గావించియున్నారు.

'అంగవ్రాతములోఁ జికిత్సకుఁడు దుష్టాంగంబు ఖండించి శేషాంగశ్రేణిని రక్షసేయుక్రియ' నవిమర్శితములును నకారణకారితములును నసంబద్ధములు నగువానిని ఖండించి సహేతుకములును, సంప్రదాయసిద్ధములును సత్యసంబద్ధములును నగువిషయములఁ బ్రకాశింపఁ జేయుట యుదారులును, మహోన్నతులు నగువిమర్శకులకు ముఖ్యకర్తవ్యము. అట్టి మహోదారవిమర్శకలక్షణలక్ష్మీభూషితులగు శ్రీ పీఠికాపురరాజేంద్రులు సూక్ష్మవిచారణముతోడను, సునిశితప్రజ్ఞతోడను నీపీఠికను రచియించి, యిట్టివిమర్శనములు భాషావాఙ్మయచరిత్రమునకును నాంధ్రజాతీయాభ్యున్నత్యమునకును నత్యంతావశ్యకము లని నిరూపించి యాధునిక విమర్శకులకు మార్గదర్శకు లైరి.

అంధపరంపరాయాత మగునపవాదములఁ బోఁగొట్టి యఖలచైతన్యప్రద మగువిజ్ఞానవివేకతేజము నొసంగి శ్రీ సూర్యారాయమహారాజేంద్రు లన్వర్థనామధేయు లై ప్రకాశించుచున్నారు.

నిడుదవోలు వేంకటరావు, ఎమ్. ఏ.,
తెలుఁగుపండితుఁడు.
శ్రీ పీఠికాపురరాజకళాశాల,
కాకినాడ.

---

శ్రీ సర్వజ్ఞసింగభూపాలునిచే సంస్కృతమున విరచింపఁబడిన రత్నపాంచాలికానాటికను సముద్ధరించి ముద్రించి ప్రకటించిన యాంధ్రభోజు లగు శ్రీశ్రీశ్రీ పీఠికాపురాధీశ్వరులు ఆంధ్రభాషాయోష కొక యమూల్యాలంకారము నొసఁగినవారైరి. దీని కశేషాంధ్రలోకమును దనకృతజ్ఞతను శ్రీవారికిఁ జూపవలసి యున్నది.

శ్రీ సర్వజ్ఞసింగమహీపతికిఁ గల విద్యావైదగ్ధ్యముఁ గవితాచాతురియుఁ, గవిపండితాదరణము నత్యుత్తమసంస్కారమును జగద్విదితములు. ఈవిషయములను శ్రీ పీఠికాపురీశ్వరులే నాటికాపీఠికయందు సవిస్తరముగాఁ బేర్కొనియే యున్నారు. శ్రీవారియభిప్రాయములు సర్వజనామోదకరములు. ఇఁక రత్నపాంచాలికానాటిక విషయమై "...మధుజల్పితైః, రత్నపాంచాలికానామ నాటికా రసపేటికా" యని సర్వజ్ఞుఁడు తెల్పినవాక్యము పరమసత్యము.

శ్రీమదాంధ్రమహాభాగవతకర్త యగుబమ్మెరపోతనార్యునకును శ్రీ సర్వజ్ఞసింగభూపతికిని నడుమఁ గలసంబంధమును గుఱించి యొకయపప్రథ యాంధ్రలోకమున వ్యాపించి యున్నది. శ్రీమహాభాగవతమును దనకంకిత మీయమిలే దనునెపమున సర్వజ్ఞుఁ డాభాగవతగ్రంథమును బలాత్కారముగా సంపాదించి పాతిపెట్టించె ననియుఁ దమపరి యొన్నఁడో యాగ్రంథము పైకిఁ దీయఁగా నందు శిథిలమైన భాగములామాకవులు పూరించి రనుటదే యీ యపవాదము. శ్రీ మహారాజావారీయపప్రథ నిర్హేతుకమని సహేతుకముగా యుక్తియుక్తముగా ఖండించియున్నారు. ఇట్టి యపవాదము లాంధ్ర సారస్వతమునఁ గ్రొత్త కావు. కాని వీనికిఁ జరిత్రాత్మకమైన ప్రబలాధారములు మృగ్యములగుట నానాఁటికి జనబాహుళ్య మిట్టివి వినోదమునకై కల్పించినగాథలే యని నిర్ణయించుచునే యున్నది.

శ్రీసర్వజ్ఞసింగభూపతి రాజ్యనిర్వహణమే తపోవృత్తిగా నెంచిన మహానుభావుఁడు. కవిపండితపోషణమే ఉత్తమధర్మముగా నెంచిన

పసిపివరేణ్యుఁడు. ఈతనికిఁ బోతన సమకాలికుఁ డైనపక్షమున నుత్తమ భక్తకవివతంసుఁ డైన పోతనను సింగభూపతి యద్వితీయముగా గౌరవించియే యుండువాఁడు. శ్రీరామపదారవిందభజనానందుఁ డగుపోతన శ్రీహరికే తనకృతి నంకిత మిచ్చినపుడు మహాభక్తుఁ డగుసర్వజ్ఞసింగభూపతి శ్రీరామునకు మాని తనకే యంకిత మిమ్మని కోరునల్పుఁడు కాఁజాలఁడు. ఒక్కవేళ నతఁడట్లు కోరి గ్రంథమును బాఁతిపెట్టించినాఁడే యందము. అగుచో, సిద్ధభక్తుఁ డగుపోతన-నిత్య సరస్వతీప్రసన్నుఁ డగు పోతన-పశువులు లేకుండ నాఁగలి నడిపిన పోతన-సరస్వతి చే వంట చేయించినపోతన-వరాహావతారముఁ దిరిగి యవతరింపఁ జేసిన పోతన-తనగ్రంథమును క్షణములోఁ దెప్పించుకొనలేకపోవునా ? సర్వజ్ఞుఁడు గ్రంథమును పాఁతించె నన్నవారే కదా పై పోతనకుఁ గలయమానుషశక్తులఁగూర్చి చెప్పినవారు! కావున, నీయపవాదము నిరాధారము, నీతిరహితము, కాన నింద్యమును.

శ్రీ సింగభూపతియు శ్రీ పోతనామాత్యునివలెనే దైవలక్షణ సంపన్నుఁడు. అతని పరమపవిత్రాశయము లకళంకితములు. అతఁడు రసార్ణవసుధాకరము, సంగీతసుధాకరము, రత్నపాంచాలిక యనునుత్తమగ్రంథములచే నమృతమూర్తి యైనాఁడు. ఈవిషయమును ఘంటాపథముగా నెలుఁగెత్తి చాటిన శ్రీశ్రీశ్రీ పీఠికాపురాధీశ్వరులు సర్వజన వంద్యులు. శ్రీవారికి శ్రీపతి చిరాయురారోగ్యము లొసఁగి యింక నిట్టి యున్నతసారస్వతమహాసేవ చేయునవకాశముల నధికముగా నిమ్చుఁగాత !

బులుసు వేంకటేశ్వర్లు ఎమ్. ఏ.,
పీఠికాపురరాజకళాశాల, కాకినాడ.

శ్రీ సర్వజ్ఞ సింగభూపాలుడు తెలుఁగువారి నోములపంట. ఆ మహనీయులు మహారాజు, మహాకవియు నయి సరసభావౌదార్య పాలనములఁ దెలుఁగువారిహృదయములఁ జూఱకొనిరి. వారి ప్రతిభా వ్యుత్పత్తుల నగ్గడించుటకు బహునిదర్శనములతోఁ బనిలేదు. రసార్ణవ సుధాకర మొక్కటి చాలును. సకలజనహృదయాహ్లాదకరజీవను లగు నట్టి ఘనప్రభులచే రచింపఁబడిన దీరత్నపాంచాలిక.

శ్రీశ్రీశ్రీ పీఠికాపురమహారాజేంద్రు లీరత్నపాంచాలికకుఁ దొలిపలుకు వ్రాసి మెఱుఁగువెట్టిరి. వీరు పీఠికారచనమునకుఁ గడంగుట యన్నివిధముల నుచితముగా నున్నది.

ఇరువురు నేకవంశసంజాతు లగుమహారాజులు, కవిపోషకులు, విద్వద్వరేణ్యులు, సరసకవితాసారజ్ఞులును. అట్టియెడ నితరు లెవ రింత యభిమానముతో సభినివేశముతో నీకార్యము నిట్లు నిర్వహింప నోపుదురు.

సింగభూపాలుడు భాగవతమును దన కంకిత మిమ్మని బమ్మెరపోతనామాత్యుని గోరి నిరాకృతులై దురభిమానముచే భాగవతమును బూడ్పించె నని కింవదంతి కలదు. సత్యాసత్యములఁ బరిశీలింపక నేఁడు కొందఱీకింవదంతిని బలురూపులఁ బ్రకాశింపఁజేయుచున్నారు. ఈ ప్రకాశకులకు మహనీయచరిత్రమునకు మాలిన్యాపాదన మాత్మదూషణ మని తెలియకుండుట శోచనీయము. ఈతొలిపలుకునందు శ్రీశ్రీశ్రీ మహారాజేంద్రులు కింవదంతీజనితమగు నపవాదమును యుక్తియుక్తముగా ఖండించి యానుశ్రవికవృత్తాంతము లెంతవఱకు విశ్వసనీయములో విశదపఱచిరి.

తా మాంధ్రభోజులై నిష్కళంకయశోభూషితులై కింవదంతీమాత్రకళంకితమైన సింగభూపాలచరితమును వన్నెకుఁ దెచ్చుట యెంతయు సన్నుతింపఁదగి యున్నది.

కాకినాడ,
**25-4-1943.**

సాహిత్యశిరోమణి, ఉభయభాషాప్రవీణ,
చతుర్వేదుల సత్యనారాయణ, M.A., B.O.L.

---

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్తు.

## చిత్రభానునామ సంవత్సర కార్యనివేదిక.

**1942—43.**

### ప్రతిష్ఠాపకులు.

శ్రీ శ్రీ మహారాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావుబహద్దరువారు పిఠాపురంమహారాజావారు, పరిషద్వ్యవస్థాపాధ్యక్షులు.

శ్రీ శ్రీ వేంకటగిరి మహారాజావారు.

శ్రీ శ్రీ బొబ్బిలి మహారాజావారు.

### ఉద్ధారకులు.

శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావుబహద్దరువారు-ఉయ్యూరు జమీందారువారు.

### అధ్యక్షులు.

సాహిత్యవిశారద కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు.

### కార్యదర్శులు.

కిడాంబి రాఘవాచార్యులుగారు, ఎం. ఏ. బి. ఎల్.

వింజమూరి వెంకన్నపంతులుగారు, ఎం. ఏ.

### కార్యనిర్వాహకసభాసభ్యులు.

శ్రీదివాన్ బహద్దర్ కొమ్మిరెడ్డిసూర్యనారాయణమూర్తినాయుఁడుగారు (కోశాధ్యక్షులు.)

,, పెద్దాడ రామస్వామిగారు, ఎం. ఏ.

,, పిశ్యారిశెట్టి రంగబ్రహ్మారావునాయుఁడుగారు.

,, కోకా శివనాథశాస్త్రిగారు.

,, కొమ్మిరెడ్డి కేశవరామమూర్తినాయుఁడుగారు.

,, చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు.

,, నిడుదవోలు వేంకటరావుగారు, ఎం. ఏ.

,, ప్రతివాదిభయంకరం పార్థసారథిగారు, బి. ఏ., ఎల్. ఎల్. బి.

,, కుందూరి ఈశ్వరదత్తుగారు, బి. ఏ.

,, అళక్కి వెంకట్రామయ్యగారు.

,, కేశవరపు కామరాజుగారు.

,, వేదుల శ్రీరామచంద్రకీర్తిగారు.

చిత్రభాను సంవత్సరముతోఁ బత్రికకు ముప్పది యొకటవ సంవత్సరము ముగిసినది. ప్రపంచము తీవ్రమగు సంగ్రామముచే నల జడి నొందుచుండుటచే ముద్రణాదికమునకు వలయుకాగితము లభింపక పెక్కు పత్త్రికలు నిలిచిపోయినవి. గ్రంథప్రకటనము సాఁగుటలేదు. అయి నను భగవంతుని యనుగ్రహమువలనఁ గొంచెము కాలవిలంబము జరిగి నను బత్త్రిక ముప్పదియొకటవ సంపుటము నెట్లో ప్రచురింపఁ గలిగితిమి. సభ్యులును జందాదారులును ఈ పత్త్రికాప్రకటనమునఁగలిగిన యాలస్యమును క్షమింతురుగాక.

పరిషత్కార్యాలయమున నిదివఱలో మేనేజరుగనున్న వ్యాకరణ విద్యాప్రవీణ, విద్వాన్ బ్రహ్మశ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు నిఘంటు కార్యాలయమునకు మార్పఁబడినందున వీరిస్థానమున వీరిసోద రులు సాహిత్యవిద్యాప్రవీణ శ్రీ చిలుకూరి విశ్వనాథశాస్త్రిగారు, మేనేజరుగఁ బనిచేయుచున్నారు.

పరిషద్భాండాగారము దినదినాభివృద్ధిని గాంచుచున్నది. శ్రీ శ్రీ మైసూరు, తిరువాన్కూరు, బరోడా, కాశ్మీరము మొదలగు సంస్థానాధి పతులు దాము ప్రకటించుచున్న గ్రంథముల నుచితముగ మన కొసఁగు చున్నారు. వారికిని, వినిమయముగఁ బత్త్రికలఁ బంపెడి పత్త్రికాధిపతుల కును మనకృతజ్ఞతను దెలుపవలసియున్నది. మన భాండాగారమున ముద్రితగ్రంథములసంఖ్య 4538. తాళపత్త్రప్రతుల సంఖ్య 4678. విని మయపత్త్రికలసంఖ్య 35. ఇంకను బెక్కు శాస్త్రగ్రంథములఁ జేర్చి భాం డాగారమును సర్వతోముఖముగ వృద్ధి నొందింపవలయును. మఱియు కాగితము లభించినవెంటనే ముద్రితాముద్రిత గ్రంథపట్టికలను (Catalogues) ముద్రింపవలసియున్నది.

మనము తాళపత్త్రగ్రంథములు క్రిమిదష్టములు గాకుండ భద్ర పఱచుచున్నను, వానికిఁ బ్రతుల వ్రాయించుటయు, ముద్రిత ప్రతులతో సరిచూచి పాఠభేదములనిర్ణయించుటయు వెంటనే జరుపవలసియున్నది. అందు ముఖ్యముగ మహాభారతమును భండార్కరు సంఘమువారివలె మనము ప్రకటించుట యాంధ్రభాష కత్యంతోపకారక మనియు, నావ

శ్యకమనియు వేఱచెప్పనక్కఱలేదు. దాని నీసంవత్సరమున ప్రారంభించి యందులకు వలయువండితధనసాహాయ్యముల సంపాదింపవలసియున్న దని కార్యనిర్వాహకవర్గమువారికి విన్నవించుచున్నాము.

పరిషత్పత్త్రిక ముప్పదియొకటవ సంపుటమున శివలీలావిలాసమునఁ బ్రథమాశ్వాసమునందు ముప్పదిరెండుపుటల గ్రంథము మాత్రమే ముద్రణమొందినది. మిగిలిన భాగము త్వరలో ముద్రింపవలసియున్నది. శ్రీ శ్రీ పీఠికాపురప్రభువుల యాదరణముచే నిఘంటుకార్యాలయమున నాల్గవసంపుట ముద్రణము నిర్విఘ్నముగ సాఁగుచున్నది. అది యచిరకాలముననే వెలువడునని తెలుపుచున్నాము.

ఆయవ్యయములు.

ఈనివేదిక కనుబంధముగ చిత్రభానుసంవత్సరపు ఆయవ్యయ పట్టిక యొసంగఁబడినది. శ్రీ శ్రీ బొబ్బిలి వేంకటగిరి మహారాజావార లిచ్చిన యుదారవిరాళములవలన సంవత్సరమునకు వడ్డి రు 750-లు వచ్చుచున్నది. దానివలనను, పుస్తకవిక్రయమువలన లభించిన ద్రవ్యముతోడను బరిషత్కార్యముల నెట్లో నిర్వహింపఁగలుగుచున్నాము. సభ్యుల సంఖ్యయు జందాదారుల సంఖ్యయు వెనుకటి సంవత్సరమునందువలెనే యున్నది. కార్యనిర్వాహకసభ్యులును, పరిషత్సభ్యులును బాగుగ నాలోచించి పరిషత్కార్య నిర్వహణమునకుఁ దగినధనమును సమకూర్చి పరిషదభివృద్ధికిఁ దగిన మార్గముల నరయవలసియున్నది.

పరిషద్భవననిర్మాణమును త్వరలోఁ బూర్తి యొనర్చుటకై తత్కార్యనిర్వాహక వర్గమువారు యుద్ధపరిస్థితులకు వెనుదీయక కార్యదీక్షను వహించి పనిచేయుచున్నారు. నూతనసంవత్సరమున దానియందు మనకార్యాలయము నెలకొలుపఁబడునని యాశించుచున్నాము.

పరిషత్కార్యనిర్వహణమున మాకు నిరంతరము తోడ్పడుచున్న కార్యనిర్వాహకవర్గమువారికి మావందనములు.

ఇట్లువిధేయులు.

కిళాంబి రాఘవాచార్యులు,

వింజమూరి వెంకన్న,

కార్యదర్శులు.

# NCOME AND EXPENDITURE STATEMENT

| సం. | ఆయము. | | | |
|---|---|---|---|---|
| . | సంవత్సరాదిని నిలువ. | ... | ... | 33- 7-11 |
| . | బ్యాంకినుండి వచ్చువడ్డీ | ... | ... | 902-11- 0 |
| | శ్రీ శ్రీ బొబ్బిలిమహారాజావారిచ్చిన గవర్నమెంటు పత్రముల వలన వడ్డీ. | 1942-43 | 353- 2-0 | |
| | ,, | 1941-42 | 200- 0-0 | |
| | ,, వేంకటగిరిమహారాజావారు | 1942-43 | 349- 9-0 | |
| | | | 902-11-0 | |
| . | సాధారణసభ్యులు. | ... | ... | 24- 0-0 |
| . | పత్రిక చందాదారులు. | ... | ... | 77- 0-0 |
| . | విడిసంచికల విక్రయము. | ... | ... | 21-12-0 |
| . | ఇతరజమలు. | ... | ... | 5-13-0 |
| . | పుస్తకవిక్రయము. | ... | ... | 488- 5-9 |
| . | క్రొత్తపల్లి సుబ్రహ్మణ్యముగారి కాతాకు | ... | ... | 1- 9-0 |
| . | పోస్టేజీవలన | ... | ... | 12- 6-9 |
| 0. | సాదరుకాతావలన | ... | ... | 5-12-6 |
| 1. | చేబదులు | ... | ... | 600- 0-0 |
| | | | మొత్తం | 2172-13-11 |

## FOR THE YEAR 1942-43. చిత్రభానుసంవత్సరము.

### వ్యయము.

| | | | |
|---|---|---|---|
| బ్యాంకి చిల్లరవ్యయములు | ... | ... | 4-15-0 |
| ఇతరవ్యయములు | ... | ... | 15- 0-0 |
| పోస్టువ్యయములు | ... | ... | 58- 9-9 |
| ఉద్యోగుల ప్రయాణవ్యయములు | ... | ... | 11- 2-0 |
| ఉద్యోగుల జీతములు | ... | ... | 831- 4-0 |
| పత్రికకు కాగితము | ... | ... | 110- 0-0 |
| పత్రిక ముద్రణము | ... | ... | 100- 0-0 |
| చిల్లరబైండింగు | ... | ... | 10- 5-0 |
| పత్రికలకు చందాలు | ... | ... | 24- 0-0 |
| గ్రంథప్రకటనము | ... | ... | 174- 9-0 |
| కొనిన పుస్తకములు | ... | ... | 38- 0-6 |
| సాదరు ఖాతా | ... | ... | 16- 9-6 |
| చేబదుళ్లు తీర్చినవి | ... | ... | 700- 0-0 |
| | | | 2094- 6-[illegible] |
| | | | 78- 7-[illegible] |

సంవత్సరాంతమున నిలువ

| | |
|---|---|
| ఇంపీరియల్ బ్యాంకునందు | 14- 5-7 |
| కార్యస్థానమున | 64- 1-7 |
| | 78- 7-2 |

మొత్తం 2172-13-1

కాశీభట్ల సుబ్బయ్యశాస్త్రి

అధ్యక్షులు.

కిడాంబి రాఘవాచార్యులు

పింజమూరి వెంకన్న

కార్యదర్శులు.

# పుస్తకవిక్రయము.

| పుస్తకము | వెల |
|---|---|
| విప్రనారాయణచరిత్రము | 4- 7-0 |
| జైమినిభారతము | 14-14-6 |
| కవిజనాశ్రయము | 16- 1-0 |
| యుద్ధమల్లుని బెజవాడశిలాశాసనము | 0-7-3 |
| జ్యోతిశ్శాస్త్రసారము | 1-10-0 |
| శ్రీప్రసూనాంబికాశతకము | 0- 1-9 |
| సర్వేశ్వరశతకము | 0- 3-0 |
| కావ్యాలంకారచూడామణి | 0-12-( |
| అకారాద్యముద్రితగ్రంథసూచిక | 2- 1-0 |
| శివతత్త్వసారము | 4- 5-0 |
| చంద్రభాను చరిత్రము | 4- 2-0 |
| శివరాత్రిమాహాత్మ్యము | 15-11-0 |
| ఆర్యభాషావిభాగము | 0- 8-0 |
| ప్రాస్వరంగములు | 0- 6-6 |
| మన్నారుదాసవిలాసనాటకము | 1-10-6 |
| కాళిందీకన్యాపరిణయము I భా | 1-10-0 |
| కాళిందీకన్యాపరిణయము II భా | 0-13- |
| ఆంధ్రధాతుమాల | 0-10-0 |
| శాసనపద్యమంజరి 1 భాగము | 2-11-6 |
| శాసనపద్యమంజరి 2 భాగము | 1- 5-3 |
| శతకసముచ్చయము 1 భాగము | 0-10-0 |
| శతకసముచ్చయము 2 భాగము | 0- 8-9 |
| పరిషత్పుస్తకభాండాగారము | 0- 6-6 |
| సూత్రాంధ్రవ్యాకరణము | 0-14-6 |
| రసాభరణము | 0-15-0 |
| ఆంధ్రశబ్దచింతామణి | 0- 7-0 |
| షోడశకుమారచరిత్రము | 1- 6-0 |
| రాయవాచకము | 3- 3-6 |

| పుస్తకము | వెల |
|---|---|
| సింహాసనద్వాత్రింశిక 1 వభాగము | 39-10-6 |
| సింహాసనద్వాత్రింశిక 2 భాగం | 1- 8-0 |
| నిఘంటుచరిత్రము | 0- 6-0 |
| ఆంధ్రకౌముది | 0- 8-0 |
| బాలభారతము | 0-10-6 |
| Defence of Literary Telugu | 0-7-0 |
| చాటుధారాచమత్కారసారః | 0- 4-0 |
| సాంబోపాఖ్యానము | 0-14-0 |
| రసార్ణవాలంకారము | 0-15-0 |
| కవిజనోజ్జీవనిసమస్యలు | 0- 3-6 |
| రఘునాథరామాయణము | 0-15-0 |
| రజతోత్సవసంపుటము | 1- 0-0 |
| అఱవదేశమునందలి ఆంధ్రవాఙ్మయము | 0-10-6 |
| లౌకికన్యాయవివరణము | 0- 8-0 |
| లక్షణసారసంగ్రహము | 1- 6-0 |
| కావ్యాలంకారచూడామణి పాఠభేదములు | 0-12-0 |
| ఉత్తరరామచరితము | 6-12-0 |
| శ్రీసూర్యరాయాంధ్రనిఘంటువు 1 వ భాగము | 113- 6-0 |
| శ్రీసూర్యరాయాంధ్రనిఘంటువు 2 వ భాగము | 118- 8-0 |
| శ్రీసూర్యరాయాంధ్రనిఘంటువు 3 భాగము | 112- 8-0 |
| అమరుకము | 0-14-0 |
| చంపూరామాయణము | 1- 0-0 |
| ఆంధ్రవాఙ్మయవికాసవైఖరి | 1-14-3 |
| | 488- 5-9 |

# ఆంధ్రసాహిత్యపరిషత్తు - ప్రతిష్ఠాపకులు.

శ్రీ శ్రీ మహారాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావుబహద్దరువారు
పీఠాపురంమహారాజావారు, పరిషద్వ్యవస్థాపాధ్యక్షులు.

శ్రీ శ్రీ వేంకటగిరి మహారాజావారు.

శ్రీ శ్రీ బొబ్బిలి మహారాజావారు.

## ఉద్ధారకులు.

శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావుబహద్దరువారు-ఉయ్యూరు జమీందారువారు.

## అధ్యక్షులు.

సాహిత్యవిశారద కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు.

## కార్యదర్శులు.

కిడాంబి రాఘవాచార్యులుగారు, ఎం. ఏ. బి. ఎల్.

వింజమూరి వెంకన్నపంతులుగారు, ఎం. ఏ.

## కార్యనిర్వాహకసభాసభ్యులు.

శ్రీదివాన్ బహద్దర్ కొమ్మిరెడ్డిసూర్యనారాయణమూర్తినాయుఁడుగారు (కోశాధ్యక్షులు.)

,, పెద్దాడ రామస్వామిగారు, ఎం. ఏ.

,, పిళ్ళారిశెట్టి రంగబ్రహ్మరావునాయుఁడుగారు.

,, కోటా శివనాథశాస్త్రిగారు.

,, కొమ్మిరెడ్డి కేశవరామమూర్తినాయుఁడుగారు, బి. ఏ.

,, చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు.

,, నిడుదవోలు వేంకటరావుగారు, ఎం. ఏ.

,, ప్రతివాదిభయంకరం పార్థసారథిగారు, బి. ఏ., ఎల్. ఎల్. బి.

,, సుందూరి ఈశ్వరదత్తుగారు, బి. ఏ.

,, అక్కిరాజు వెంకట్రామయ్యగారు.

,, కేశవరపు కామరాజుగారు.

,, వేదుల శ్రీరామచంద్రకీర్తిగారు.

# శ్రీసూర్యరాయాంధ్ర నిఘంటువు.

## తృతీయసంపుటము.

శ్రీపిఠాపురము మహారాజావారి ధనసహాయముచే రచియింపఁబడుచున్న పెద్దనిఘంటువులోని రాయల్ సైజు 1000 పుటలుగల ప్రథమసంపుటమును, 955 పుటలుగల రెండవసంపుటమును, 980 పుటలుగల మూఁడవసంపుటమును ముద్రితములై విక్రయమునకు సిద్ధముగానున్నవి. ఇందు ప్రథమసంపుటమున అకారము మొదలు, ఔకారమువఱకును గల యచ్చు లాదియగుఁగల సంస్కృతాంధ్రశబ్దము లన్నియుఁగలవు. రెండవసంపుటమున 'క' మొదలు 'జ' వఱకుఁగల శబ్దములును, తృతీయసంపుటమున 'చ' మొదలు 'త్స' వఱకుఁగల శబ్దములునుగలవు. ఇదివఱకున్న నిఘంటువు లన్నిటికంటె నిది సర్వవిధముల నుత్తమ మయినది. ఈభాగములు శబ్దరత్నాకరములో 500 పుటలలో మాత్రమే యిమిడినవి. ఈనిఘంటువునందు, సంస్కృతశబ్దములు పూర్వనిఘంటువు లన్నిటియందుకంటె మిక్కిలి యధికముగా నీయఁబడినవి. కావున సంస్కృతవిద్యార్థులకుఁ గూడ మిగుల సహయోగకరముగా నుండును. అచ్చిక పదములకుఁగల యర్థభేదములఁ గనఁబఱిచి వానికిఁ బ్రమాణవాక్యములు పూర్వగ్రంథములనుండి విపులముగా నీయఁబడినవి. లభ్యమైనంతవఱకుఁ దెనుఁగుశబ్దములకు సంస్కృతప్రాకృతద్రావిడాది భాషలయందుఁగల సజాతీయ పదములు చూపఁబడినవి. కేవలము విడిశబ్దములే గాక సందర్భానుసారముగ సమస్తపదములు (Phrases) ను వానికిఁ గల యర్థములును ప్రయోగములును గూడ నీయఁబడినవి. జనకశబ్దముల క్రింద జన్యశబ్దములు చూపఁబడినవి. ఇది విద్యార్థులకు సహకారి. ఈపుస్తకమును రచియించుటకు ముద్రించుటకు విశేషద్రవ్యముపట్టినను ధనవంతులకేగాక జనసామాన్యమునకుఁ గూడ లభ్యముగా నుండవలయునను తలంపుతో నీక్రిందివెలలు నిర్ణయింపఁబడినవి. ప్రథమసంపుటము సాదాప్రతి వెల రు 5 లు, మేలుప్రతి (Art Paper) రు. 7 లు, ద్వితీయసంపుటము సాదాప్రతి రు. 4 లు, మేలుప్రతి రు. 5 లు, తృతీయసంపుటము సాదాప్రతి రు. 4 లు, మేలుప్రతి రు 5 లు.

---

Printed by N. Achutaramiah at the Cocanada Printing Works, Cocanada, and Published by K. Raghavacharyulu, Secretary, Telugu Academy, Cocanada.